# తేట మనసులు

(నూత్న సాంఘిక నాటకం)

రచన:

తంరాజు వెంకటేశ్వరరావు.

ప్రచురణ:

పాల్ అండ్ కో., ఏలూరు.

తొలికూర్పు :
2,000 ప్రతులు.
తొలిముద్రణ :
1965 మే.

★

ముఖచిత్రం :
వెంబూ.

★

వెల :
2-00
(కాపీరైటు రిజిష్టర్డ్)

★

ముద్రణ :
శ్రీ
సీతారామాంజనేయ
ప్రెస్, ఏలూరు.

B

# హెచ్చరిక!



శ్రీ లక్ష్మీకాంత కళా నిలయం,
సత్యనారాయణపురం,
విజయవాడ-2.

# వీరా సీతంరాజు!

నాటయాత్రై రచనలకుపైగా రచించి ఆధునిక రచయితగా మీ అభిమానాన్ని అందుకున్నారు! వీరి రచనలన్నీ వరుసగా ముద్రణలు ముగించుకుంటున్నాయ్! నాటిక నాటకాలు వాడవాడలా వందలాది సమాజాలుచే విరివిగా ప్రదర్శింపబడుతున్నాయ్! రచయితేగాక మంచి నటులు కూడ. విరుద్ధ మనస్తత్వాలుగల పాత్రలు ఎన్నో నటించి మీ మన్ననలు పొందారు! సినిమా రచయితలుగా "సినీ ప్రభ" "సినీరమ" "తారాపథం" "తెలుగుతెర" మొదలగు సినిమా పక్షపత్రికలకు



సంపాదకులుగా పనిచేశారు. వీరి పేరుతోనేగాక భద్రకాళి, ఇందిరాదేవి, ప్రవీణ, రేవతి మొదలగు పెన్‌పేర్లతో అనేక జానపద నవలలు అందించి ప్రత్యేక స్థానాన్ని అలంకరించారు! నలుగురుతోనూ సన్నిహితంగావుండే తత్వం. వీరి రచనలు అన్నీ స్వంత రచనలే. ఎప్పుడూ ఏదోవొకటి రాస్తుండడం హాబీ! 1924 మే 5 వ తేదీన గన్నవరం తాలూకా మొఖాసా వీరవల్లి గ్రామంలో జన్మించారు! తండ్రి గుర్నాధరావు, తల్లి

కీ॥ శే॥ లక్ష్మీకాంతమ్మ – పెరిగింది, చదివింది, గుడివాడలో నివాసం – విజయవాడ, మద్రాసులలో – అనుభవంలో ఎన్నో కష్టాల్ని ఎదుర్కున్నారు! అయినప్పటికీ ఎప్పుడూ చిరునవ్వుతో వుండే స్వభావం! ఇంకా యింతకన్న మంచి రచనలు ఎన్నో అందచేస్తారని తలుస్తాం! వీరికృషికి అన్నివిధాలా చేయూత నివ్వగలందులకు సర్వేశ్వరుణ్ణి ప్రార్థిస్తాం.

— పబ్లిషర్స్.



# సమర్పణ



సాహితీ ప్రియులు, ఆధునిక రచయితలు,

ముఖ్యంగా నాకు మిత్రులు,

కె. మురళీకృష్ణగారికి.

— రచయిత.

# పాత్రలు — స్వభావాలు

## రాజిత

వయస్సులోవున్న కన్య - ఒకరిని ప్రేమించి భగ్న ప్రేమికురాలుగా అమరేంద్రను పెళ్ళాడుతుంది. భీమశంకరంగారి యేకైక పుత్రిక, మంచి స్వభావం. వయస్సు 18 సం॥లు.

## భీమశంకరం

లక్షాధికారి - యాభైయేళ్లు దాటాయ్. కంటికిరెప్పగా పెంచుకునే కూతురుకోసం తనప్రాణాల్ని అర్పించాడు - మనస్సు మంచిది.

## అమరేంద్ర

పెద్దమనిషిగా తిరుగుతూ గజదొంగగా కొంపలు తీయడంలో ఘనుడు. రాజితను ప్రేమించి, పెళ్లాడి మోసగించిన మహానుభావుడు.

వయస్సు 25 సం॥లు

## ప్రభాకర్

తన పవిత్రప్రేమలో రాజిత ఉద్ధరించాలని ఆరాటపడి, ఆఖరికి అవిటివాడుగా దొంగగా నిందలుమోసి చివరికి నిజాయితీని చాటుకున్న డాక్టర్. వయస్సు 25 సం॥లు.

## జగం

వీణ్ణి కొంచం జాగ్రత్తగా చూడాలి : మాటల్లో తేనెలు కురిపించి చల్లగానెత్తిన చేతులుపెట్టే రకం - పైకి అమాయకుడుగా కనిపిస్తాడు.

వయస్సు 25 సం॥లు

## శివయ్య

జగం ఆడే అంతర్నాటకానికి ఎప్పటికప్పుడు ఆటంకాలు కలుగచేసి చితికిపోయిన యజమాని కుటుంబాన్ని, ఆస్తిని కాపాడిన త్యాగమూర్తి. పైకి మతిచెడినవాడిలా నటిస్తుంటాడు. వయస్సు 40 సం॥లు.

## గోవిందు

భీమశంకరం యింట్లో పనిమనిషి. వయస్సు 60 సం॥లు.

ఇంకా కావలసిన వర్గాలు వస్తారు.

# తేట మనసులు

## 1 వ రంగము

[ అది భీమశంకరం డాబాలో కచేరీ చావిడి. చాలా విశాలంగా వుంటుంది. ఎదురుగోడకు కిటికి, దానిపైభాగంలో గోడకు భీమశంకరం భార్య ఎన్లార్జిమెంటు, అటూయిటూ తదితర కేలండర్లు, ఫొటోలు వ్రేలాడు తుంటాయ్. కుడి ఎడం గోడలకు సిల్కు కర్టన్లు అలంకరించబడిన గడపలు ఎదురుబొదురుగా వుంటాయ్. గదిలో ఎడంవేపు గుమ్మానికి ప్రక్కగా పెద్దసైజు బీరువా. ఆ ప్రక్కనే రెండుకుర్చీలు - కుడివేపు గుమ్మానికి కొంచెం యివతలగా పడకకుర్చీ-ప్రక్కనే చిన్న టేబులు. దానిమీద టెలిఫోను కనిపిస్తుంటాయ్. తెరప్రక్కకు తొలుగుతుంది. ముందుగా గదిలో ఎవరూ కనిపించరు. టెలిఫోను మాత్రం అదేపనుగా రింగవుతూంటుంది. బయటనుంచి శివయ్య వేగంగా వస్తాడు - ఒకసారి లోపలకు తొంగిచూసి అటూయిటూ చూసి విసుగ్గా టెలిఫోనున్న టేబులు దగ్గరకు వెడతాడు.]

శివయ్య: మనుషులు లేకపోయినా అదేపనిగా అరుస్తావేం! పనీపాటా లేని పెద్దమనుషు లందరికీ యిదొక హేబిట్ అయింది! పెద్ద పనుండేడ్చినట్లు! (రిసీవర్ చెవిదగ్గర పెట్టుకొని) హలో! ... ఆ! ... ఎవరూ? ... (నవ్వి) మీరా జగడంగారూ! (నవ్వి) యేమిటి విశేషం? ...

జగడం అనద్దంటూరా! అలవాటయిన ప్రాణం! వెంటనే మానగలనా! (నవ్వి) కుదరదంటూరా! ... కుదరకపోతే మానేస్తాను! ... జగంగారూ అంటూన్లండి! ... అది సరే! యింతకీ యేమిటి విశేషం? ... భీమశంకరంగారున్నారా అంటూరా? వారు భీమడోలు వెళ్లారండి! (లోపలనుంచి భీమశంకరం వస్తాడు) ... పది పదిహేను రోజులువరకూ రారు!

భీమ: (వెనుకనుంచి) ఎవరు?

శివయ్య: (చూడకుండానే రిసీవరు అలా వుంచే) భీమశంకరం గారు! వాళ్ల చుట్టాలింటో దినం అయితేను వెళ్లారు!

భీమ: ఎక్కడికి?

శివ: (చూడకుండానే విసుగ్గా) భీమడోలు! ఎన్ని సార్లు చెప్పాలి!

భీమ: (కోపంతో) నోర్మూయ్. (రిసీవరు అందుకుంటూను)

శివ: నువ్వేనోర్మూయ్! ఎవరనుకున్నావ్? (భీమశంకరంను చూస్తాడు. భయంతో కొద్దిగా వణుకుతూ)

భీమ: హలో! ... వాట్! రాస్కేల్‌నా! ప్లీజ్ గీవ్ రెస్పెక్ట్ యెండ్ టేక్ రెస్పెక్ట్!... నేనెవరో తెలుసా!...ఎవరైతే నీకెందుకంటావా! ఏమిటీ బుద్ధిలేదూ! ... మిస్టర్ జగం! (విసుగుతో పెద్దగా) నేను భీమశంకరంను! యింత క్రితం మాట్లాడింది మా గుమస్తా శివయ్య! ... వట్టిరోగ్!

శివ: (తగ్గుస్థాయిలో తెల్లబోయి) నేనా!

భీమ : (కోపంతో రిసీవరు పట్టుకునే) పటప్ ! యిడియట్ ! (నవ్వి మాట తడబడుతు) సారీ నిన్ను కాదు ! మాగుమాస్తా నన్నాను !... ఏమిటీ ! వెళ్లిన పనయిందా ? (సంతోషము తో) వెరీగుడ్ ! నాకు తెల్సును ! నువ్వు చూసి రమ్మంటే కాల్చివస్తావని !... నేను యింటిదగ్గరే వుంటా ! నీయిష్టం ఎప్పుడొచ్చినా సరే ! చూడు వచ్చేప్పుడు పార్టీవచ్చినా లేకపోయినా పైకం మాత్రం నువ్వు పట్టుకొచ్చెయ్ !... అలాగే... ఓ... యస్ !... థాంక్సు ! (రిసీవరు పెట్టేసి సిగిరెట్ వెలిగిస్తాడు)

శివ : (చిన్నగా నవ్వుతూ) ఏంపని మామయ్యా !

భీమ : (వెటకారంగా) నీకెందుకు అల్లుడయ్యా !...

శివ : గుమాస్తా పనులన్నీ నన్నే చూడమన్నావు కదా !

భీమ : చూడ మనట మేమిట్రా చవట ! నువ్వే గుమాస్తావి ! మన బంధుత్వం బయటకి రాకూడదని చెప్పాను !

శివ : నేనెవరికీ చెప్పలేదుగా !

భీమ : చెప్పిన పని చేయడం వరకే నీ బాధ్యత ! నిన్ను పోషించే బాధ్యత నాది !

శివ : మరి నా ఆస్తి ?

భీమ : నాస్తి ! ఎవర్నడుగుతావ్ ! ఆస్తి వుంటే నీకీ గుమాస్తా కర్మ మేమొచ్చింది ? హాయిగా......

శివ : (దిగులుగా) మానాన్నగారే బ్రతికుండేవారు ! చక్కగా యే బియల్లో చదివి వకీలునై కూర్చునేవాణ్ణి !

భీమ : అన్నీ యేడ్చావ్లే! ఫో యిక్కణ్ణుంచి!

శివ : సరేలే మామయ్యా!

భీమ : మామయ్యా అనద్దురా అన్నానా! (శివయ్యా విసుగుతో నాలుక కర్చుకొని రెండుచంపలూ వేసుకుంటాడు) మనిషి మంచివాడివే. రూపం, గుణం అన్నీ వుండీ మైండ్ లేని మంద భాగ్యుడువి!

శివ : అందుకేగా అప్పుడప్పుడు వంటరిగా కూర్చుని యేడుస్తుంటాను.

భీమ : నీ ఏడుపు తర్వాత యేడుద్దువుగాని, ఈ రోజు నీకు సెల విచ్చాను. వెళ్ళిపో!

శివ : పండగా లేదు గిండగా లేదు! వృధాగా శెలవెందుకు? నేను శెలవు తీసుకుంటే పోస్టుచేయాల్సిన కవర్లన్నీ ఎవ రంటిస్తారు? నాపని నేను చేస్తాను.

భీమ : (విసుగ్గా) అవన్నీ నేను చూసుకుంటాన్లే! ఫో యిక్క ణ్ణుంచి! (శివయ్యా వెనక్కి నక్కి చూస్తూ లోపలకు వెళ్ళబో తాడు) ఎక్కడికి?

శివ : ఇంట్లోకి!

భీమ : ఎందుకు?

శివ : శెలవిచ్చావుగా!

భీమ : శెలవిచ్చింది యే సినిమాకో తగలడమని! యింద! (పర్సు తీసి రెండు రూపాయల కాగితం యిచ్చి) కాస్సేపు అలా తిరిగిరా మైండ్ అయినా కుదట పడుతుంది!

శివ : వెరీగూడ్ ! (రెండురూపాయల కాగితం ముద్దు పెట్టుకొని గిర్రున వెనక్కి తిరిగి ఘబాల్న బయటకి వెడతాడు.)

భీమ : (గట్టిగా నిట్టూర్పు విడుస్తాడు) ఎందరి పీడన్నా వదుల్తోంది కానీ వీడి పీడ వదిలేట్టు కనిపించడంలేదు ! కర్మ ! (కుర్చీలో కూర్చుని) అమ్మాయ్ ! రాజితా ! (సిగరెట్ దమ్ముపట్టి) రాజితా ! (బయటనుండి జగం వస్తాడు) రావోయ్ జగం ! రా !

జగం : పిచ్చాడెక్కడికి పోతున్నాడు ?

భీమ : అడిగితే చెప్పే వాడేగా !

జగం : చెప్పటానికి తీరిక లేదుట ! మళ్లావచ్చి తీరుబడిగా చెప్తానన్నాడు ! (నవ్వి) అలాబయటకి తరిమెయ్యడం భీమశంకరం గారి పనేనని అనుకున్నాను.

భీమ : తెచ్చావా పైకం ?

జగం : తేక విడిచి పెడతానా ! (నవ్వుతూ కర్చీఫ్ మూట అందించాడు) వాడికి వినిపించలేక విసిగిపోయాను ! ఒక పట్టాన లొంగడేమో ననుకున్నాను ! ఎలాగయితేనే ఉల్టాసీదాచేసి పల్టీకొట్టించి మరీ పట్టుకొచ్చాను కరన్సీ కట్టలు ! ఒక సారికి నాలుగుసార్లు లెక్కపెట్టుకొని మీరు తృప్తిపడి నన్ను తృప్తి పర్చండి !

భీమ : వాడి కిచ్చిన వరాలు యేమిటి ?

జగం : ఒకటా ! వాళ్ళు వుంటున్న గూడేనికి "హరిజనవాడ" అని పేరు పెట్టాలట ! సందులు గొందులూ సిమెంటు రోడ్లు గానీ, తారు రోడ్లుగానీ పడాలిట ! ప్రతిసందులోనూ పంపు,

ఎలక్ట్రిక్ దీపాలు వుండాలిట! చదువుకోడానికి గ్రంథాలయం, వార్తలు వినడానికి పబ్లిక్ రేడియో, యివిగాక చదువులు నేర్చుకోడానికి పాఠశాల వాడిబొంద, నా బొందా. యిలాంటివి ఎన్నో గొంతెమ్మ కోరికలు కోరాడు! అన్నిటికీ సరేనన్నాను! వెనకపడివున్న గూడెం ముందుకి రావాలన్నాడు! మనం సరే నంటే వచ్చేసినట్లేనని హామీయిచ్చేశాను. అప్పటికీ వాడు నమ్మేట్టు కనిపించలా! మాజీ చైర్మన్‌గారైన మీ మాట మంత్రుల దగ్గర అగ్గిభరాటా అన్నాను. అందులో యిద్దరు మంత్రులు మీకు వేలువిడిచిన మేనత్త కొడుకులు అవుతారని బొంకేను!

భీమ : (కొంచెం కంగారుతో) అలా ఎందుకు చెప్పావయ్యా?

జగం : అవసరానికి!

భీమ : అనవసరంగా కొంపదీశావ్!

జగం : (పరవాలేదన్నట్లు గర్వంతో నాలుకచప్పరిస్తాడు) ఆ!

భీమ : వాళ్ళపేర్లు చెప్పమనలా?

జగం : వాళ్లు అన్నారు! నేనూ చెప్పాను!

భీమ : ఏమని చెప్పావ్? ఎవరిపేర్లు చెప్పావ్!

జగం : మీ శాభయమే అక్కర్లేదు. పెద్దవాళ్ళ మధ్యనుండే బంధుత్వం చెప్పినా ఫలానాని పేర్లు చెప్పకూడదన్నాను.

భీమ : (నిట్టూర్చి) బ్రతికించావ్!

జగం : నన్ను బ్రతికించాల్సిన బాధ్యత మీది!

భీమ : అదేం?

జగం: మంత్రులవరకూ మనం ఎలాగూ వెళ్ళం! వాళ్ళిచ్చిన డబ్బు మొహం చూశన్నా మీరు శ్రద్ధవహించాలి!

భీమ: ఏం చేయమంటావ్!

జగం: మీ పలుకుబడిని కౌన్సిల్‌లోనన్నా వినియోగించి వాళ్ళ కోరికల్లో కొన్నయినా తీర్చేట్టుచూడండి!

భీమ: అదొకమాటా!

జగం: కాకపోయిందో మధ్య నా వీపు సదునుచేస్తారు!

భీమ: (హేళనగా) పట్టువేయడానికి మన సున్నబ్బట్టీల నిండా కావలసినంత సున్నంవుంది. భయపడకు. (వెన్ను తడతాడు నవ్వుతూ. జగంకూడా నవ్వుతాడు. లోపలనుంచి రాజిత యేదో పుస్తకం తీసుకొనివస్తుంది. రాజితను చూసిచూడ నట్లు అభినయిస్తూ) ఆ! మనం లోపలకు వెళ్ళి మాట్లాడు కుందాం పద! (యిద్దరూ లోపలకు వెళ్లబోతారు) నువ్వా రాజితా! యింట్లో యేం చేస్తున్నావమ్మా!

జగం: అదిగో కనబడటల్లా డిటెక్టివ్ నవల! పఠనం చేస్తూవుండి వుండాలి! (భీమశంకరం పుస్తకం అందుకుంటాడు) యీ రోజుల్లో ఆడమగవ్యత్యాసంలేకుండా యీ పిచ్చి ఎక్కు వయింది! (నవ్వి) అవున్లే యింట్లోవుండే ఆడపిల్ల! కాల క్షేపానికి యేదో ఒకటి!

భీమ: (పుస్తకంమీద పేరు చూస్తూ) రణరంగవీరులు!... ఇదేదో ఫోక్ సబ్జెట్ లాగుంది! (పుస్తకం యిచ్చేసి) మన జగాన్ని పంపించివస్తాను! చదువుకుంటూవుండు! (నవ్వుతూ లోపలకు వెడతాడు. జగం భీమశంకరంను అనుసరిస్తాడు.

రాజిత అక్కడే నిలబడి లోపలకు వెడుతున్న వాళ్లను చూసి చిన్నగా నవ్వుకుంటుంది. తర్వాత అక్కడున్న కుర్చీలో కూర్చుని ఇన్‌లాండు లెటర్ తీసి లోలోన చదువు కుంటుంది. వుండుండొకసారి యేదో ఆలోచిస్తూంటుంది. అంతలో బయటనుంచి శివయ్య వస్తాడు)

శివ : (గొంతుతగ్గించి) జగడం వున్నాడా వెళ్లాడా!

రాజి : (నొసల్లు చిట్లించి) ఎవరు ? జగడమా !

శివ : అబ్బ ! వాడేజగం ! మీనాన్నకు పర్సనల్ శక్రటరీ !

రాజి : నాన్నగారితోనే ఉన్నాడు !

శివ : విరగడైపోలేదన్నమాట ! సరె ! నేనన్నా పోతాను ! (నీరసంగా నిట్టూర్చి వెనక్కితిరిగి వెళ్ళబోతాడు)

రాజి : ఆయనుంటే నువ్వుపోవడం దేనికి !

శివ : 'ఉష్ణం! ఉష్ణేణ శీతలం' అన్నారు! వాళ్లిద్దరూ కలిసి వుండగా నేను కంటపడ్డానంటే వాళ్ళల్లోవేడి, నాకు శీతలం ఒక్కసారి కలుగుతాయ్ ! అంచేత, మళ్లీవచ్చి మాట్లాడ తాను ! మన్ని వెళ్ళనియ్ ! (వెళ్ళబోతాడు.)

రాజి : ఇదిగో బావా !

శివ : (ఆగి) కాస్తగొంతు తగ్గించు! 'బావా' అనడం మీ నాన్న విన్నాడంటే మనబాజా పట్టాడన్నమాటే! నేను గుమస్తాను, శివయ్య అను ! ఆ !

రాజి : (చిన్నగా నవ్వి) మొత్తానికి బలే భయస్తుడివి !

శివ : భగవంతుడు నన్నిలా సృష్టించాడు ! దానికి నేనేంచేసేది?

రాజి: (హేళనగా) నేను చెప్పనా!

శివ: ముందాఘటాన్ని వెళ్లనియ్! తర్వాత తీరుబడిగా చెబుదువు గాని! (వెళ్ళబోతాడు)

రాజి: (చేయిపట్టుకుని) నీ కొచ్చిన భయమేం లేదు! వాళ్లు నిన్నేమీ అనరు!

శివ: (ఆగి) అంటే?

రాజి: (ఒకసారి లోపలకు తొంగిచూసి చిన్నగా) వాళ్లిద్దరూ...

శివ: పెద్ద ఎత్తు మీదనే వున్నారు! వుంటే మనకెందుకు?

రాజి: ఎందుకేమిటి! విని సంతోషిద్దామని కదా!

శివ: ఒక ప్రక్కన పేద ప్రజానీకం డొక్కలు అంటుకుపోయి యేడుస్తుంటే మనం పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వుతూండా లన్నమాట! ఆబాబుకి కూతురి వనిపించావ్!

రాజి: (చిరుకోపంతో) ఏమిటంటున్నావ్?

శివ: నేనడమేమిటి? తండ్రి తుంటరిపనులు చేస్తున్నంత మాత్రాన సన్నిహిత సంబంధాన్ని మర్చిపోతామా! కొట్టు కున్నా, తిట్టుకున్నా, పీకలు పిసుక్కు చచ్చినా మీరిద్దరూ తండ్రీ కూతుళ్లే! నాలాంటివాడి సంబంధమంటావా పూర్వీ కులు పెట్టిన సిద్ధాంతం ప్రకారం తట్టతగలేస్తే సంబంధ బాంధవ్యాలు పుటిక్కిన తెగిపోతాయ్! ఆ!

రాజి: అసలువిషయం చెప్తే తర్వాత చెప్తాను!

శివ: నేను చెప్పినట్లు మీనాన్నతో నేనా!

రాజి: కాదు!

శివ : మరేంచెప్తావ్ ?

రాజి : నీ తెలివి!

శివ : తెల్లారినట్లేవుంది!

రాజి : నిన్ను మెదడులేని మందభాగ్యుడనికదా నాన్న అంటారు!

శివ : మీనాన్నేకాదు! అందరూ అంటారు! అద్దంలోచూసుకుంటే అడ్డెడు తప్పేలాంత తలవుంది! మొయిలేక ఛస్తున్నాను! ఇంతబరువైన తలకాయలో నలుసంతయినా మెదడుండదా అని నా అనుమానం!

రాజి : నీ అనుమానం నేను తీరుస్తాను! వాళ్లు యేం చేస్తున్నారో చెప్పు!

శివ : వందరూపాయిలనోట్లు లెక్క పెట్టుకొని ఇనప్పెట్టెలో పెట్టి దాస్తూండాలి!

రాజి : ఆడబ్బుకి వెనకా లేమన్నాకథ వుందా ?

శివ : వున్న కథనే మర్చిపోతుంటే కళ్లారాచూస్తున్న కథలు గుర్తుంటాయా! యేమిటో! మామయ్య చెప్పినట్లు నా మెదడు పనిచేయడం లేదు! యింక పనిచేయదేమో!

రాజి : (చిన్నగానవ్వుతుంది) నువ్వునిజంగా వెర్రివాడివే బావా!

శివ : యాదార్థంచెప్పే వాళ్ల సంఖ్య పెరిగిందే!

రాజి : అయినప్పుడు జరిగిందేమిటో చెప్పడానికేం ?

శివ : మామయ్యకు చెప్పనంటే చెప్తాను!

రాజి : చెప్పను అంటే చెప్పను!

శివ: మామయ్యా ఒక్క నీ విషయాల్లో తప్ప ప్రతిదాంట్లోనూ అన్యాయం అక్రమం!

రాజి: ఏమిటీ!

శివ: మరేమిటనుకున్నావ్! చేస్తున్న ఘోరాలు చెప్పాలంటే రోజులు చాలవు! (లోపల భీమశంకరం, జగంల నవ్వువిని పిస్తుంది) అదిగో కాలింగ్ బెల్!

రాజి: (తెల్లబోయి) కాలింగ్ బెల్లా!

శివ: ఆ! అయ్యగార్లు నవ్వుతున్నట్లు గుర్తు! నేనిప్పుడుంటే డేంజరు లైట్ టపీమని వెలుగుతుంది; వస్తా! (గబగబబయటకి వెడతాడు. రాజి చిన్నగా నవ్వుకొని తనకేం తెలియనట్లు నవల చదువుకుంటూ కూర్చుకుంటుంది. లోపలనుంచి భీమ శంకరం, జగం వస్తారు.)

భీమ: సరే! నువ్వెళ్ళి రా!

జగం: నేను చెప్పింది మరువకండి!

భీమ: చెప్పావుగా! వెళ్ళు!

జగం: (నవ్వుతూ) అలాగే! (వెళ్ళబోయి రాజితను చూసి ఆగి) నవల మాంచి రసపట్టులోవున్న దనుకుంటాను!

రాజి: కథాకథనం వేగంగావుంది! (నవ్వుతుంది).

జగం: తెలివిగల పిల్ల! భీమశంకరంగార్కి తగిన కూతురు!

రాజి: అని ఓసర్టిఫికెట్ ఖివ్వండి! అద్దంవేయించి గోడకు పారేస్తాను! (భీమశంకరం నవ్వుతాడు).

జగం: చూశేరా! అమ్మాయిగారి ఛలోక్తులు!

రాజి: మీ కుయోక్తులు ముందెంత లెండి!

భీమ: (చప్పట్లుచరుస్తూ ఫక్కునవ్వి) వండర్ ఫుల్! వండర్ ఫుల్! అమ్మాయితో మాట్లాడలేని వాడివి నువ్వెందుకు పని కొస్తావయ్యా! (జగం భీమశంకరంతో యేదో చెప్ప బోతాడు) సరిలే! వెళ్లు! వెళ్లు!

జగం: (నవ్వుతూ) అలాగే! (గబగబా బయటకి వెడతాడు).

భీమ: ఏదో పెద్ద తెలివిగల వాడులాగా మాట్లాడొస్తాడు! (నవ్వుతాడు).

రాజి: నాన్నా! (ఏదో చెప్పబోతుంది).

భీమ: నిన్నొకటి అడగాలనుకుంటుండగానే యీ జగం వచ్చాడు! అడగనామ్మా!

రాజి: అడగండి నాన్నా!

భీమ: యదార్థం చెప్తావుగా!

రాజి: తండ్రి దగ్గర దాపరికం దేనికి నాన్నా!

భీమ: నీలాగా ప్రభాకర్ కూడా నిన్ను ప్రేమిస్తున్నాడా?

రాజి: మా ప్రేమలో కళంకం లేదు!

భీమ: పెళ్లాడతానని ప్రమాణం చేశాడా!

రాజి: చేశారు!

భీమ: చేసిన వాగ్దానం నిలబెట్టు కోలేడేమో ననిపిస్తున్నది!

రాజి: అదేమిటి నాన్నా!

భీమ : కాకపోతే తండ్రిని వప్పించి వస్తానని వెళ్లినవాడు యింత వరకూ తిరిగి రాకపోవడం అనుమానానికి దారి తీయదా అమ్మా !

రాజి : లేదు నాన్నా ! అతనికేదో పనివుండి రాలేదు! యిచ్చిన మాట కాదనే తత్వంకాదు! ఒకరిని అవమానించాలన్న ఆశయం కలవాడు కాదు !

భీమ : నీకున్న నమ్మకం నాకులేదు ! ప్రభాకర్ మంచివాడే ! కాదనను ! కానీ అతను తండ్రిచాటువాడు ! తండ్రిని ధిక్కరించే శక్తి అతనిలో లేదు !

రాజి : అంటె !

భీమ : ప్రభాకర్ నిన్ను పెళ్లాడడు !

రాజి : (విస్మయ) నాన్నా !

భీమ : అవునమ్మా ! ప్రభాకర్ తండ్రి నాకు ఉత్తరం వ్రాశారు !

రాజి : ప్రభాకర్ నాకూ ఉత్తరం రాశాడు !

భీమ : నీకూ రాశాడా ! (క్షణం తెల్లబోయి చూస్తాడు. రాజిత డిటెక్టివ్ పుస్తకంలో వుంచిన యిన్‌లాండ్ కవరు తీసి అందిస్తుంది. భీమశంకరం లోలోన చదువుకుంటూంటాడు).

రాజి : మాపెళ్ళికి వాళ్ళ నాన్న అంగీకరించలేదట ! అందుకు కారణాలు యెన్నోచూపారుట! అవన్నీ ఎంతవరకు నిజమో ప్రభాకర్ ఊహకు అందడం లేదట! నన్ను తప్ప ఎవరినీ పెళ్ళాడనని, తండ్రిని ఎదిరించి బయల్దేరివస్తున్నాడుట !

భీమ: (ఉత్తరం చూస్తూ) రాత్రి మెయిలులో బయల్దేరి వస్తున్నాను! మన పెళ్ళి జరిగితీరుతుంది! నువ్వు ధైర్యంగా వుండు! ఇట్లు, నీ ప్రభాకర్! (ఉత్తరం మడిచి రాజితకు యిస్తూ రెప్పపాటుకాలం ఆలోచిస్తాడు) తత్వాలు భేదించిన తండ్రీ కొడుకుల మధ్య నువ్వు అడుగు పెట్టబోతున్నావామ్మా! (చిన్నగా నవ్వుతాడు)

రాజి: వాళ్ళనాన్నగారు మీకేమని రాశారు!

భీమ: ఏమని రాసినా ఆయన ఉత్తరంలోని ప్రతి అక్షరం వ్యతిరేకంగానే వుంది. ప్రతిమాట మనల్ని చులకనచేస్తూనేవుంది!

రాజి: అంత అపరాధం మనమేం చేశామని అలా వ్రాశారు?

భీమ: నువ్వుపసిదానివి! నీకు తెలియదు! నువ్వు తప్పుచేయకపోవచ్చు! గతించిన కాలంలో ఎవరికీ అపకారం కాని అపరాధం జరిగుండచ్చు! అది ఆదర్శంగా మనం పాటించినా అపరాధంగా యితరులు గుర్తిస్తారు!

రాజి: మీరంటున్నది అర్థంకావడంలేదు! అపరాధమేమిటి! గుర్తించడమేమిటి!

భీమ: భీమశంకరం పరువు ప్రతిష్ఠలతో బ్రతకచ్చు! అతని కూతురు రాజిత పవిత్రంగా తేట మనసుతో తన జీవితాన్ని సాగించాలని తాపత్రయపడచ్చు! ఆశయం మంచిదైనా ఆచరణలో అది చేయకూడదని నేరంగా గుర్తిస్తారు! వివాహబంధానికి ప్రతిబంధకంగా సూచించి తేటమనసులు గాయపరుస్తారు!

రాజి: (బోధపడనట్లు చూస్తూ) నాన్నా!

భీమ: అవునమ్మా! (ఎదురుగా వున్న ఏస్లారిమోటు దగ్గరకు వెడతాడు) ఇంతవరకూ కడుపున పుట్టినకూతురు అయినా చెప్పని రహస్యం పరిస్థితుల వత్తిడికి తట్టుకోలేక బయట పెడుతున్నాను!

రాజి: (సమీపించి) చెప్పండి నాన్నా!

భీమ: (ఫొటోచూస్తూ) మీ అమ్మను నేను పవిత్రంగా పెళ్లాడాను! ఆమె జీవితంలో ఎలాంటి కళంకం లేదని నాకు తెల్సును! కాని...

రాజి: కాని, చెప్పండి నాన్నా!

భీమ: మీతాతయ్య చనిపోయాక కుటుంబ పోషణ, పిల్లల పెంపకం మీ అమ్మమ్మమీద పడింది! చెరువు ఎండగానే చేపలు బయట పడతాయ్! తండ్రి పోగానే తల్లీ పిల్లలు నిలువనీడ లేకుండా నడివీధిలో నిలిచారు! ఆకలి బాధకు తట్టుకోలేక తండ్రిపోయిన సంవత్సరానికే మీ మామయ్య మరణించాడు! మిగిలింది మీ అమ్మ వక్కతే! పుత్ర శోకాన్ని భరించలేని ఆ తల్లి మిగిలిన కూతుర్నయినా బ్రతికించుకోవాలని ఆరాటపడింది! అవసరాలకు తట్టుకోలేక ఆత్మహత్యకు మనస్సు వప్పక బ్రతుకు బాటలో తప్పటడుగులు వేసింది! మీ అమ్మను పెంచింది. ఉండటానికి పంచ ఏర్పాటుచేసింది! తన బ్రతుకు పాడయినా మీ అమ్మకు విద్యాబుద్ధులు నేర్పించి వివేకవంతురాల్ని చేసింది! (కంటతడి తుడ్చుకుంటాడు.)

రాజి: (విచారం అణుచుకుంటూ) నాన్నా!

భీమ: అవును తల్లీ! మీలాగే మేమిద్దరం కాలేజీలో ప్రేమించుకున్నాం! ఒక వ్యభిచారి కూతురని మా పెళ్ళికి మా నాన్న అంగీకరించలేదు! తల్లి పాడైనా కూతురులో కళంకం లేనప్పుడు ఆమెకు ద్రోహంచేయడానికి మనస్సెలా వప్పుతుంది? ఆత్మబలంతో ఆశయ సంకల్పసిద్ధికోసం అయినవాళ్ళనందర్నీ ఎదిరించి మీ అమ్మను పెళ్ళాడాను. పెళ్ళయిన నాలుగేండ్లకు నువ్వు పుట్టావ్! తర్వాత రెండేళ్ళకు మీ అమ్మ పోయింది. అప్పటినుంచీ కంట్లోపాపగా, కంటికి రెప్పగా ఇంటికి వెలుగుగా పెంచుకుంటున్నాను!

రాజి: ఇంతవరకూ యీవిషయం చెప్పలేదేం నాన్నా!

భీమ: చెప్పాల్సిన అవసరం రాలేదమ్మా! మాలాగే నువ్వూ ప్రభాకర్ ప్రేమించుకుంటుంటే ఎంతో ఆవేదనపడేవాణ్ణి. ఆనందమూ పొందేవాణ్ణి. విశాలభావాలుకలిగిన ప్రభాకర్ నీకు అన్యాయం చేయడన్న నమ్మకం నాకుంది. ఆ నమ్మకంతోనే మీకు అడగకుండానే నా సందేశాన్ని అందిచ్చాను. మధుర భావాలు కలిగిన మీ తేటమనసుల్ని యేకంచేయమని అనుక్షణం భగవంతుణ్ణి కోరుకుంటున్నాను. అంతేకాని ఏనాటి చరిత్రో మీ జీవితాల మధ్య పెట్టిన ఉక్కు-గోడగా నిలుస్తుందని ఊహించలేదు. తండ్రి వ్రాసిన ఉత్తరంలో తనయుడు దారితప్పతాడని అనుమానించును.

రాజి: ప్రభాకర్ సంగతి యింకా మీకు తెలియదు! మాట నిలబెట్టుకోడంలో ...

భీమ: అతనికతనే సాటని నీకు వ్రాసిన ఉత్తరమే చెప్తున్నది. నీకోసం తండ్రిని వ్యతిరేకించి వస్తున్నాడు. మీరు ఆదర్శ దంపతులుగా ఆనందంతో నవజీవనం సాగించండి!

రాజి: (పొంగిపొర్లే ఆనందంలో) నాన్నా!

భీమ: హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను! మీ పవిత్ర ప్రేమకు ఆనందిస్తున్నాను. (వెన్ను తడతాడు) అవును! నీ ఉత్తరం ఆధారంగా మొన్న రాత్రి మెయిలు ఎక్కుండాలి!

రాజి: నిన్న వుదయమే రావలసింది! రానికారణం బోధపడటంలేదు!

భీమ: బండి తప్పివుండాలి! ఇవ్వాళనో రేపో తప్పకుండా వస్తాడు. (రిస్టువాచి చూచుకొని) రాలేదనేనా నీఆలోచన! (నవ్వి) పిచ్చిదానా! వస్తాడు! (వెళ్లి కుర్చీలో కూర్చుంటాడు) లోపలకువెళ్లి చదువుకోమ్మా!

రాజి: (ఏదో అనుమానిస్తూ నిలబడి వుంటుంది)

భీమ: ఏమైనా అడగాలనుకుంటున్నావామ్మా!

రాజి: మీతో ఒకవిషయం చెప్పాలనుకుంటున్నాను!

భీమ: ఏమిటది!

రాజి: మీచుట్టూ తిరుగుతున్న జగం జగడాల పుట్టని మీకు తెలియదానాన్నా!

భీమ: తెలుసునమ్మా! మన్ని ఆశ్రయించుకు బ్రతికేవాడు! మన్నేం చేస్తాడు?

రాజి : జుట్టు జుట్టు ముడిపెడతాడు ! తనపొట్ట నింపుకోడానికి అనేక కుట్రలు పన్ని యితరుల్ని కత్తులబోనులో యిరికించి తను తప్పుకుంటాడు !

భీమ : (నవ్వి) నాకు తెలియని విషయాలు నీకు చాలా తెల్సునే!

రాజి : అబద్ధమని మీరంటున్నారా ?

భీమ : అనకపోయినా వాడేంచేయలేడంటున్నాను !

రాజి : కల్మషపూరితమైన మనస్సు అతనిది ! అలాటివాళ్లను నమ్మి చేరనీయకూడదు ! వీలు చిక్కించుకొని ఎప్పుడోప్పుడు తప్పకుండా నెత్తిన చేతులు పెడతారు !

భీమ : అదంతా నేను చూసుకుంటాన్లేమ్మా !

రాజి : ఏమో నాన్నా ! మీరు అందర్నీ నమ్మేతారు !

భీమ : (చిన్నగా నవ్వి) పిచ్చితల్లి ! నమ్మడం ! నమ్మించడం వ్యాపారలక్షణం ! నిజానికి జగం మంచివాడు ! అతని మాటలతీరు ! మోసగాడేమోనని అనుమానం కలిగిస్తుంది ! (మళ్లీ చిన్నగా నవ్వి) నీకీ అనుమానం కలగడానికి శివయ్యే కాదు కారణం !

రాజి : ఒకసారి ప్రభాకర్ చెప్పాడు !

భీమ : అతనికేం తెల్సు ?

రాజి : అది నాకేం తెలుస్తుంది ?

భీమ ! తెలియనప్పుడు నీకెందుకు భయం ! (మళ్లీ నవ్వుతాడు సన్నగా) చూడమ్మా ! ఒకవేళ ప్రభాకర్ వస్తాడేమో ! నువ్వు ముస్తాబై సిద్ధంగావుండు ! కనీసం గడపలో అడుగు

పెట్టినప్పుడన్నా ఆనందంతో ఆహ్వానిద్దాం! రాజిత పుస్తకం విడిచి లోపలకు వెడుతుంది) కన్నతండ్రియినా యీ భీమ శంకరం ఆడే చదరంగం దానికేం తెల్సును! పట్టుమని పదహారుసంవత్సరాలయినా లేని పసికందు. (కాలుస్తున్న సిగరెట్ యాష్ట్రేలో పడేసి అక్కడున్న దినపత్రిక తిరగేస్తూ కుర్చీవెనక్కి చేరగిల పడతాడు. కొద్దిక్షణాల అనంతరం పత్రికచూస్తూనే) ఆఁ! (తృళ్ళిపడి కూర్చుంటాడు) మొన్న రాత్రి నాగపూర్‌నుంచి వస్తున్న మెయిలు మందరగిరి బ్రిడ్జికూలిపోగా పట్టాలు తప్పి పడిపోయింది. ప్రయాణీకులు నూటికి తొంభైమందిచొప్పున మృత్యురణానికి పాల్పడ్డారు. కొంతమంది యేమైందీ అజలేకుండా వుంది. దెబ్బలు తిన్న వారికి హాస్పటల్లో చేర్చి ప్రత్యేకమైన చికిత్స చేయిస్తున్నారు!... స్వ. వి. (తెల్లబోయి చూస్తూ) ఎంతపని జరిగింది! (ఆలోచిస్తాడు.)

రాజి: (లోపలనుంచి వచ్చి టేబులుమీదున్న రణరంగ పీడులు పుస్తకం తీసుకుని తిరిగివెడుతూ) యేమిటి నాన్నా ఆలోచిస్తున్నారు!

భీమ: (తేరుకొని) యేమీలేదు తల్లీ! (రాజిత తిరిగి లోపలకు వెళ్ళబోతుండగా) అమ్మాయ్ రాజితా! (రాజిత ఆగుతుంది) అవునూ! ప్రభాకర్ ఉత్తరం రాసిన తేదీ గుర్తుందా?

రాజి: (పుస్తకంలో ఉత్తరం తీసి) మార్చి 10 వం నాన్నా!

భీమ: ఏం లేదమ్మా! ఊరికే తెల్సుకోవాలని అడిగేను. (రాజిత పుస్తకంతో సహా లోపలకు వెడుతుంది) ఉత్తరం వ్రాసిన తేదీ మార్చి పది! (మళ్ళీవెంటనే పత్రిక ఆతృతగా

చూసి) రైలు ప్రమాదం జరిగిందీ మార్చి పదినే! (బయట నుంచి అమరేంద్రుడు నీటుగా డ్రస్ వేసుకొని వస్తాడు. అతనివెనకే లెదరు బాగ్ పట్టుకొని గోవిందు వస్తాడు. వాళ్లని చూడకుండానే) జరిగిన రైలు ప్రమాదంలో నాగపూర్ నుంచి బయల్దేరిన ప్రభాకర్ కూడా చిక్కుకున్నాడా!

అమరేంద్ర: యూ ఆర్ కరక్ట్! (యీవినింగ్ హాట్, కూలింగ్ గ్లాసెస్ తీసి చిన్నగా నవ్వుతాడు) ఏరా గోవిందా!

గోవిం:(అవునని తల పంకించి) మీాకు ష్యూరీ కరక్టు!

భీమ: ఎవరుమీారు? (యిద్దర్నీ చూస్తాడు)

అమ: మేము ఎవరయినా మీాకోసమే మీాయింటికే, మీాతో మాట్లాడాలనే మిమ్మల్ని చూసిపోవాలనే వచ్చాం! (గొంతుతగ్గించి) భీమశంకరం గారంటే మీారేకదూ?

భీమ: అవును!

అమ: అవునో కాదోన్న అనుమానంతో అడుగుతూనేవచ్చాం! యేరా గోవిందా! (గోవిందు అవునని తల ఆడిస్తాడు)

భీమ: మీారు – (సందేహంగా చూస్తాడు)

గోవిం: (అమరేంద్ర చేతిలో యీవినింగ్ హాట్ అందుకుంటూ) వారిపేరు అమరేంద్ర! ప్రస్తుతం ఐ. సీ. యస్. చదివేరు!

అమ: (అవునన్నట్లు తల ఆడించి వెంటనే తేరుకొని) ఛాఛా! ఐ సీ యస్ కాదు అయ్యేయస్! యూ ప్లీస్ సరిగా చెప్పు! గోవింద్‌ని చూస్తాడు)

గోవిం : రెండూమూడక్షరాలే కాదూ! కొంచెం తికమక పడ్డాను! అంతే!

అమ : అవును! (గోవిందుని చూపించి) వీడు నా పి. ఏ. పేరు గోవిందా!

గోవిం : 'దా' కాదు గురూ 'దు' అంటే గోవిందు! (వెకిలిగా నవ్వుతాడు) మా గురువుగారుకూడా అప్పుడప్పుడు పొర పాటుపడతారు! (నవ్వి) మీరేమీ అనుకోకండి!

భీమ : కూర్చోండి! (కుర్చీచూపిస్తాడు)

అమ : థాంక్యూ థాంక్యూ! మూలగా వున్న కుర్చీ దగ్గరగా! లాగి కూర్చుంటాడు - గోవిందు పెట్టె అప్రక్కన పెట్టి దానిమీద కూర్చుంటాడు).

భీమ : మీరువచ్చిన పని?

గోవిం : మీతోనే సార్!

భీమ: ఎవరు పంపారు!

అమ : కాళ్ళూచేతులూ లక్షణంగావుంటే ఒకళ్లు పంపేదేమిటి?

గోవిం : మేమే తిన్నాగా వచ్చేశాం!

భీమ : ఏదయినా వ్యాపారం చేస్తారా మీరు!

అమ : నాగపూర్‌లో మాది పెద్ద బిజినెస్!

గోవిం : అయినా మా గురువుగారు ఎప్పుడూ ట్రైన్ల మీదనే ట్రావిలింగ్!

అమ : ఆ బిజినెస్ అటువంటిది!

భీమ: అలానా! (నవ్వి) పెద్దలు యేదోపనిమీద నే వచ్చి నట్లున్నారు!

గోవిం: అవును! చచ్చాం! అహా! వచ్చాం!

అమ: మీ అమ్మాయి రాజిత వుందికాదూ!

భీమ: మా అమ్మాయి మీ కెలా తెల్సును? (రాజిత లోపల నుంచి వస్తుంది.)

అమ: హల్లో రాజితా! హౌడూయూడూ?

రాజి: (తెల్లబోయి చూస్తుంది) ఎవరు మీరు!

అమ: యస్! యూ ఆర్ కరక్టు! నాటు వేషం మాని నీటుగా తయారయ్యానుకాదూ! బహుశా గుర్తు పట్టివుండవు! మనిద్దరం చిన్నప్పుడు చదువుకున్నాం! పెద్దయినాక నీ గురించి యితర్త్రా విన్నాను.

గోవిం: అప్పుడు వెంటపడితే దవడ పగల గొట్టిందన్నారు యీావిడేనా గురువుగారూ! (యేదో గుర్తుకొచ్చినట్లు అంటాడు)

అమ: (గోవిందుని చిన్నగా) షటప్!

గోవిం: థాంక్యూ!

అమ: (సిగరెట్ వెలిగించి) మనిద్దరం చదువుకునే రోజుల్లో చాలా సన్నగా చిలిపిగావుండే దానివి! యిప్పుడెల్లా వున్నావ్ రాజితా?

రాజి: రెండుకి రెండు నాలుగు కళ్ళున్నా కనబడడంలేదూ!

గోవిం : (చిన్నగా) పెట్టిందిరా వాత! (నవ్వుతూ) అమ్మాయి గారు కొంచెం లావెక్కినట్లున్నారు!

రాజి : మనిషిని ఎలామారినా (అరచెయి సవరించుకుంటూ) చేతివేళ్లల్లో చురుకుతనంపోలేదు! (అమరేంద్రుడు, గోవిందు కూడా చంపలు సవిరించుకుంటూ ఒకరి నొకరు అర్థం కానట్లు చూసుకుంటారు).

భీమ : (నవ్వుతూ) అమ్మాయ్! కాఫీపంపించుతల్లీ! రాజిత లోపలకు వెళుతుంది).

అమ : మా పరిచయం మీకు అర్థమయ్యే వుంటుందను కుంటాను. చిన్నప్పుడు నేను చాలా కొంటెగా వుండేవాణ్ణి! క్లాసులోవున్నా ఆడ పిల్లల్ని అస్తమానం యేడిపిస్తూ వుండే వాణ్ణి! ఆ టయింలోనే బహుశా . . .

గోవిం : అమ్మాయిగారు చంప ఛళ్ మనిపించి వుంటారు!

అమ : అవును! (తేరుకొని) అ! (గోవిందునిచూసి భీమ శంకరంతో) చిన్నప్పటి చిలిపిగుణం పెద్దయితే మారదూ!

గోవిం : అప్పటికీ యిప్పటికీనా! అబ్బో! ఎంతో తేడావుంది! (నవ్వుతూ తెల్సుకోవాలన్న కుతూహలం కనబరుస్తూ) గురువుగారూ! అమ్మాయిగారి చేతి చురుకు తెలిసిన రోజుల్లో మీరు మట్టి లాగూలు వేశేవారనుకుంటాను! (అమరేంద్రుని చూస్తాడు).

అమ : (హెచ్చరికగా) గోవిందా!

గోవిం : (వినయవిధేయతలతో) గురూ!

అమ: జాతి జబ్బు పోనిచ్చావు కాదురా! ముందువచ్చినపని...

గోవిం: మీరు చెప్పండి గురూ! మళ్లీమనకి టైమవుతున్నది!

భీమ: ఏమిటది?

గోవిం: చల్లకొచ్చి ముంతదాచుడం దేనికి గురూ! చెప్పెయ్!

భీమ: పరవాలేదు చెప్పండి!

అమ: నువ్వు చెప్పరా గోవిందా!

భీమ: (గోవిందును చూస్తాడు)

గోవిం: మా గురువుగారు ఐయ్యేయస్ పాసవగానే డిప్యూటీ కలెక్టర్ ఆఫరు అందుకున్నారు. కానీ ఆ ఉద్యోగం నిరాకరించి స్వస్థలం అయిన నాగపూర్‌లో స్వయంకృషి మీద బిజినెస్ ప్రారంభించారు. చెప్తే దిష్టి తగుల్తుందేమో గానీ అయిదారు లక్షల రూపాయల ఆస్తి గడించారు!

అమ: ఎక్కువే వుంటుందిరా యిడియట్!

గోవిం: వున్నా వుండవచ్చు!

భీమ: అలాగా!

గోవిం: ఎన్ని సంబంధాలు వచ్చినా ఆయనగారికి నచ్చిన పిల్ల చిక్కకపోవడంతో యేసంబంధాన్నీ కేర్ చేయలేదు.

భీమ: ఇంతకీ మీరు పెళ్ళి చూపులకి వచ్చారన్నమాట!

అమ: అవును సార్!

గోవిం: ఆమధ్య వ్యాసరచన పోటీలో ప్రథమ బహుమతీ పొందినట్లు మీ అమ్మాయి రాజిత ఫోటో పత్రికల్లో ప్రక

టించారు. అప్పటినుంచీ మా గురువుగారు మీ అమ్మాయిని తప్పకుండా పెళ్లాడాలని తీర్మానించుకున్నారు.

అమ : అవసరమైతే లక్ష ఎదురిచ్చయినా సరె!

భీమ : అమ్మాయి మీకు నచ్చిందా!

గోవిం : నచ్చబట్టేకదా నానాబాధలూపడి అడ్రసు తెల్సుకు వచ్చింది.

భీమ : అమ్మాయి సంబంధం ఖాయమయింది.

అమ : (దిగాలుపడి) గోవిందా!

గోవిం : తొందరపడకండి గురూ!

భీమ : మీ నాగపూర్ కుర్రాడే! మీసాల మాధవయ్యగారు మీకు తెలిసేవుంటారు!

అమ : ఆయనకి ఖాయంచేశారా!

భీమ : ఆయన కొడుకు ప్రభాకర్! మద్రాసులోనే యం. బి. బి. యస్. (M. B. B. S.) చదివేడు. మీకు తెలిసేవుండాలే!

గోవిం : అతను మినహా నాగపూర్‌లో అందరూ తెల్సును. యింతకీ ...

భీమ: రాజితా, ప్రభాకర్‌లు ప్రేమించుకున్నారు! హరిహరాదులు వచ్చినా వాళ్ళసంబంధం చెదిరేదికాదు!

గోవిం : అంత నమ్మకంగా చెప్తుంటే యింకేం మాట్లాడతాం! పోదాం పదండి! యేదయినా గీతలో వుండాలి! (నిట్టూర్పు విడుస్తాడు).

తెరలో: సార్! టెలిగ్రాం!

భీమ: (సంతోషంతో) టెలిగ్రాం ప్రభాకర్ యిచ్చుంటాడు! జస్టేమినిట్! (వేగంగా బయటకివెళ్ళి నిముషంతర్వాత అతి నీరసంగా లోపలకు వస్తాడు).

అమ: ఇంతలో అంత నీరసించారేం! యేమయింది!

భీమ: సర్వం తారుమారయింది! ఆశలు నీటకలిశాయ్! (టెలిగ్రాం అమరేంద్రకియిస్తాడు)

అమ: ప్రభాకర్ ఎక్స్పైర్డ్ యిన్ ట్రైన్ యాక్సిడెంట్! ఎమ్. పి.

గోవిం: (తెల్లబోయి) యమ్. పి. అంటే (భీమశంకరం ఆలోచిస్తాడు)

అమ: ఏ మెడికల్ ప్రాక్టీషనరో అయివుండాలి! మనం బయల్దేరిన ఘడియలు మంచివికాదు!

గోవిం: అందుకేగాంసు మనవెనకే వచ్చింది అవాంతరం! వెళ్లమనుకుండానే పోదాం పదండి!

భీమ! (నీరసంగా నిట్టూర్చి) వస్తాంసార్! యిదిగో టెలిగ్రాం!

భీమ: (తేరుకొని టెలిగ్రాం అందుకుంటాడు) యిప్పుడు మనస్సేం బాగుండలేదు! మీకు అభ్యంతరం లేకపోతే రేపు టెల్లుంటిలో రండి. మాట్లాడదాం!

అమ: అలానే! పద గోవిందా! (రెండు అడుగులువేసి ఆగి) ఇందులో మనం చేసిన తప్పేంలేదు! మీరు విచారించకండి!

గోవిం: సాధ్యమైనంతవరకూ అమ్మాయిగారిని జాగ్రత్తగా చూసుకోండి. పెద్దలు మీకు వేరే చెప్పాల్నా! (నవ్వుతూ) వస్తాం! పదండి గురూ! (అమరేంద్ర గోవిందులు బయటికి వెడుతూంటారు. బయటనుంచి శివయ్య విసురుగావచ్చి ఆ యిద్దరూ పూర్తిగా వెళ్ళేవరకూ అర్థంకానట్లు అటే చూసి భీమశంకరంను చూస్తాడు.)

భీమ: శివయ్యా!

శివ: ఇంకా శ్శెపు అలాతిరిగి రమ్మంటారా సార్!

భీమ: కాదు. అమ్మాయిని యిలాపిలు! (శివయ్య లోపలకు వెడతాడు Prabhakar expired in train accident M. P. అని లోలోన చదువుకుంటాడు. తర్వాత యేదో ఆలోచనలో కంటతడి తుడ్చుకుని టెలిగ్రాం మడిచి జేబులో పెట్టుకుంటాడు,)

రాజి: (లోపలనుంచి వస్తూనే) ఏం నాన్నా!

భీమ: (రాజితను తెల్లబోయి చూస్తాడు.)

రాజి: ఏమిటి నాన్నా అలా చూస్తారు? యేం జరిగిందో చెప్పండి!

భీమ: ఏమని చెప్పేది తల్లీ! అడుగడుగునా వస్తున్న అవాంతరాలకు అంతులేకుండా వుంది. అశుభం శుభం తెలియని నీ మీద భగవంతునికి యెందుకో అంతకోపం!

రాజి: (నొసళ్ళు చిట్లించి) భగవంతుడు కేమిటి? కోపమేమిటి?

భీమ: ఏమని చెప్పేదమ్మా! మనం నిర్మించుకున్న ఆశాసౌధాలు ఒక్కసారిగా అడుగంటిపోయాయ్! ప్రభాకర్...

రాజి : రావడానికి నిరాకరిస్తూ ఉత్తరం రాశాడా ?

భీమ : (విన్లేక) అమ్మా ! రాజీ !

రాజి : చెప్పండి నాన్నా !

భీమ : చెప్పడానికి నోరు రావడం లేదు. చెప్పి ఫలితం లేదు. ఇదిగో టెలిగ్రాం ! (టెలిగ్రాం అందిస్తాడు తను అవతలగా వెళ్ళి నిలబడతాడు.)

రాజి : (వణుకుతూ చిన్నగా) టెలిగ్రాం (మడతవిప్పి చూస్తుంది) ఆఁ ! ప్రభాకర్ చనిపోయాడు ! (చేతిలో టెలిగ్రాం క్రింద పడుతోంది) ప్రభాకర్ ! (కుప్పలాగ కూలబడుతుంది.)

భీమ : (గట్టిగా) అమ్మా ! (ఆతృతగా వెళ్ళి పట్టుకుంటాడు) శివయ్యా ! శివయ్యా ! (అరుస్తాడు.)

శివ : (లోపలనుంచి వస్తూనే) మామయ్యా !

భీమ : కాశిని నీళ్లు పట్టుకురా ! (శివయ్య లోపలకెళ్లి గ్లాసులో నీళ్లు తెస్తాడు. రాజిత ముఖంమీద చల్లుతూ) అమ్మా ! రాజితా !... నేనమ్మా ! మీనాన్నని ! రాజిత ! (రాజిత వదలదు) శివయ్యా ! అమ్మాయిని పట్టుకో ! (శివయ్య అలా చేస్తాడు. భీమశంకరం టెలిఫోన్ దగ్గరకు వెళ్లి నెంబరు టరన్ చేస్తుంటాడు)

శివ : (క్రిందపడివున్న టెలిగ్రామ్ చూసి) వాట్ ప్రభాకర్ మరణించాడా ! వెరీసారీ వెరీసారీ !

భీమ : హుష్ ! (రిసీవర్ పైకితీసుకొని హలో ! డాక్టర్ !

[ తెర ]

# తేట మనసులు

## 2 వ రంగము

రంగాలంకరణంతా మొదటి రంగంమాదిరే వుంటుంది! భీమశంకరం కూర్చుని పత్రిక తిరగేస్తూంటాడు. బయటనుంచి ప్రభాకర్ మహమ్మదీయ యువకుడుగా తన రూపం మార్చుకుని వస్తాడు. (ఒక కాలు విరిగివుంటుంది. రెండు చంకలక్రిందా కర్రలు మోపుపెట్టి నడుస్తుంటాడు. ఆకారంలో పూర్తిగా మార్పు కనబడుతుంది. అందంగా కత్తిరించబడిన రెండు అంగుళాల గడ్డం, కళ్లకు రోల్డుగోల్డు ఫ్రేంతో కూడిన కూలింగ్ గ్లాసెస్, నెత్తిన కుచ్చుటోపి, మనిషిలోని నిండుతనాన్ని పెంచడంతో మరింత హుందాగా కనిపిస్తాడు. కుడిచేతిలో స్టెతస్కోప్, పట్టుకుంటాడు).

ప్రభా : నమస్తే సార్!

భీమ : నమస్తే! (పత్రిక ప్రక్కనపెట్టి ప్రభాకర్‌ని పరీక్షగా చూస్తాడు)

ప్రభా : మీరే కీపేర్ భీమశంకర్!

భీమ : అవును! మీరు ...

ప్రభా : మీకే శివయ్యా ఆహ్వానించార్ మాకీ! హిచ్చిన మాట ప్రకారం హూంచ్చిహేశాం! (నవ్వి) శివయ్యా హుంంిందీ లేంకీ బోలోసాబ్!

భీమ : ఉన్నాడు. పిలుస్తాను కూర్చోండి! (కుర్చీ చూపిస్తాడు.)

ప్రభా : హచ్చా! (నవ్వుతూ కూర్చుంటాడు.)

భీమ : (లోపలకు చూస్తూ) శివయ్యా! శివయ్యా!

శివ : (లోపలనుంచి వస్తూనే) సార్! (ప్రభాకర్‌ని చూసి) అరె! వచ్చారే! మీమాటే! అనుకుంటున్నాను.

ప్రభా : మాదీ మాటహంటే మాటే! మీరూ పిల్వగానే హొస్తాం హనీ బోలాం! హన్న విధంగాహొచ్చివేశాం!

శివ : సార్! వారు ఫారెన్ రిటన్ – పెద్దడాక్టర్! వారిచేత్తో ఎలాంటి కేసుపట్టినా బంగారంలాగా నయం అవుతున్నది.

ప్రభా : నాదీ చేతిలో హేమ్టిహుండింది? హంతా యిశ్వాసంతో హుండిండీ!

భీమ! (నవ్వుతూ) అంతే అంతే! మీ చేతి చలవకంటే మాట తీరు మంచిదనిపిస్తున్నది! చక్కగా చిరునవ్వుతో మాట్లాడుతున్నారు!

శివ : అందుకేగా మీ రోగం కుదురుతుందని పిలిచాను.

భీమ : నాకేం రోగం!

శివ : అదేమిటి సార్ అలా అంటారు? (ప్రభాకర్‌తో) వారికి తిన్నది అరక్క అజీర్తివ్యాధితో రోగం ప్రారంభించింది! అశ్రద్ధచేశారేమో అవయవాలన్నీ చెడిపోయి విడవకుండా మనోవ్యాధై పట్టుకు కూర్చుంది! దానికి తగ్గట్టు విశ్రాంతి తక్కువ! బర్డన్సు యెక్కువ! వీటన్నిటికీ తోడు రక్తపోటు వుండనే వుంది! యివన్నీ నేను చెప్తుంటే మామయ్యకి,

అహంకారదు సార్‌కి కోపం! రోగం దాచుకుంటే! ఏక్షణంలో టక్కీమని ప్రమాదము సంభవిస్తుందోని మా అందరికీ భయం!

ప్రభా: హైసాబోలో! (చిన్నగా నవ్వుతాడు)

భీమ: బోలంటంలేదు వాడిబొందా లేదు. కానీ నాకు వేరే జబ్బేంలేదు. వాడికి మెదడు సరిలేక మీవంటి పెద్దల్ని అనవసరంగా ఆహ్వానించి మీ టైమ్ వేస్టుచేశాడు! మీరేమీ అనుకోకుండా వెళ్ళిరండి!

శివ. అధికారి తిట్టినా తప్పులేదు. తలవంపు లేదు! ఆయన మాటలునమ్మకండి సార్! ఆయన నిలువంతా రోగమయం. నా మాటయందు నమ్మకం లేకపోతే రాజితను అడగండి!

ప్రభా: రాజిత హంటే హెవర్?

శివ: అయ్యగారి కూతురు అమ్మాయిగారు!

ప్రభా: పిల్వాండీ హడుగుదాం!

శివ. స్నేహితురాలి పుట్టినరోజు పండగట! విందారగించి రావడానికి వెళ్ళింది!

భీమ. నామాట నమ్మండి! నాకే జబ్బులేదు! వాడికి మైండ్ సరిలేక మిమ్మల్ని పిలిచాడు!

శివ: అనకూడదుకానీ సార్‌గారికి మైండ్ సరిగావుంటేరోగం అలాదాచుకుంటారా! నామాట అబద్ధమో నిజమో పరీక్షిస్తే మీకే తెలుస్తుంది! ఆ!

ప్రభా: హైసా బోలో! పైసా ఖర్చు హవుతుంటేహానీ అనీ హుండాలి!

శివ : గట్టిగా అంటే కోపం వస్తుందికానీ అంతే!

ప్రభా : హారేభీమశంకరంగార్ ! నాకీ పరీక్ష ఫీజ్ గిరిక్షా ఫీజ్ వసూల్ చేయడం హల్వాటూలేదు! హొచ్చినవాణ్ణీ రానే హొచ్చాన్ ! మీపే హస్తం హిలా హివ్వండి! పల్సు చూస్తామ్! (సమీపించి నాడి పరీక్షచేస్తాడు - తర్వాత స్టెతస్కోప్‌తో గుండెలు వగైరాలు చూస్తాడు) హారే! హేప్పీహాండీ! నాడీ హింతావీక్‌గాహుంటే రోగంలేదూ హనీ శెప్తార్! హిపీమాదిరీ అశ్రద్దా చేస్తే మీకీ హాస్టే కాలం బతకర్ ! హింతా జబ్బా హుంశింపే మీకీ ...

శివ : జబ్బుని డబ్బులాగా దాచుకొని పైగా ఆయన్ని అల్లరి పెడుతున్నామని మాఅందర్నీ అంటార్ సార్ !

ప్రభా : మాకీ తెల్సింపీగా హిష్టూ! రోగంకుదర్చాకుండాగానే హొదిలేపేలేదూ! (భీమశంకరంతో) హిదిగో భీమశంకరం గార్ ! మీకీ డబ్బు హిచ్చినా లేకాపోయినా మీకీ జబ్బు నయంచేయడాన్కి మాకీ పూనుకుంటాం!

భీమ : ఏమన్నారూ! నాకు నిజంగా జబ్బుందా ?

ప్రభా : దేశదేశాలూ ఖండఖండాలూ తిర్గినా డాక్టర్నీ నాకీ! అందుకే మీకీలాగా నాకీ తెల్సుకోలే హల్వాటూ లేద్! మీకీ జాగ్రత్తగా అర్థం చేస్కోండీ నాదీభావం! యే డాక్టర్కీ తెల్వనీ రోగం మీది! మందూ తీస్కోపోతే మూడోనాటికీ టపా కట్టేస్తార్ మీకీ!

శివ : సార్ సార్ ! మమ్మల్నిందర్నీ విడిచివెడతారా! మీకు యేమయినాసరే మందువాడాలి! ఆ!

భీమ: (క్షణం ఆలోచించి) మీపేరు ?

ప్రభా: బిస్మిల్లాఖాన్ !

భీమ: మీరు షెహనాయ్ ఎక్స్పర్టా ?

ప్రభా: (నవ్వి) పేరూ హొక్కటేహయినా హాయనక్కీ వేర్ నాకీ వేర్.

భీమ: మీరొకమాటిస్తే మీ దగ్గర మందు వాడతాను.

శివ: చెప్పండి! ముందు మాటా యివ్వడంలో డాక్టర్ సాబ్ ఎప్పుడూ వెనకడుగు వేయరు!

ప్రభా: మెదడూ తర్వాహయినా మీదీ శివయ్యా హచ్చా మాటకారీ హండీ! (నవ్వుతాడు) మీదీ మెదడూకూడా మాకీ కుదురుస్తాం!

శివ: మీమేలు యీజన్మకాక మరో మూడు జన్మల వరకూ మర్చిపోను! ముందు మామయ్యా అహ నవాబుగార్కి మాటిచ్చి మందు ప్రారంభించండి! తర్వాతనాపని పదు దురుగాని!

ప్రభా: (భీమశంకరంతో) మీరు కోరే హేంటిహా !

భీమ: అమ్మాయి వచ్చేవేళయింది! దాంతోమాత్రం నా ఆరోగ్యం మంచిదని చెప్తాండండి!

ప్రభా: హేంటిహా హబద్ధం హాడమంటార్ మాకీ!

భీమ: అవసరానికి ఆడడంలో అపరాధము లేదులెండి!

శివ: అందులో బాబుగార్కి మాంచి అనుభవం!

ప్రభా: వారీ అనుభవం మాకీ లేదు! మాకీ నిజంబోల్తాహ్!

భీమ : ఈ విషయంలో మాత్రం నామాట వింటురూ!

ప్రభా : హందుక్కావుండా కారణం బోలండీ మాకీ!

భీమ : అమ్మాయి అసలే మనోవ్యాధితో క్రుగ్గిపోతున్నది! దాని మనస్సు మళ్ళీ దార్లో పెట్టాలని యెంతగానో ప్రయత్నిస్తున్నాం!

ప్రభా : మాకీ పెడ్తాం!

భీమ : బాగుచేయగలశక్తి ఒక్క భగవంతునిలోనే వుంది! యీ సమయంలో నారోగం దానికిచెప్తే మరీ క్రుగ్గిపోతుంది! అంచేత ...

ప్రభా : మీకీ చెప్పాహొద్దాహంటే మాకీ మానీవేస్తాం! హా!

భీమ : చిత్తం!

శివ : ఇవ్వాళ ఏకాదశీ గురువారం గురికుదరటానికి, రోగం ముదరకుండా తగ్గడానికీ పసందైన రోజు. చికిత్స ప్రారంభించండి!

ప్రభా : ముందూ మోషన్స్‌కీ మందూ హీస్తామ్! రేపటినుంచీ ఫస్టుక్లాస్ అయినామంటు వాడతామ్!

భీమ : అలాగే! (ప్రభాకర్ మెడిసిన్ బాగ్‌లోనుంచి యేదో పొట్లం తీసిస్తాడు) ఈ మందు ...

ప్రభా : రాత్రికీ నిద్రపోయే ముందూ హంగట్లో హేస్కోని హర హవున్సూ వాటర్ తాగివేయండీ! పచ్చం గిచ్చం హేమ్లీ లేదు. రేపూ పదీఘుంటల్ హయ్యేసరికి మొత్తం ఖాళీ!

శివ : (తృళ్ళిపడి) ఏమన్నారూ !

ప్రభా : మీరీ ఘూబ్రాకి పడ్తార్ హేట్టిహాండీ! ఖాళీ హాంటే మొత్తంగా కడుప్పులో హుండా మలినం, గిలినం బయట్కి థొడూ హానీ హ్థారం! హాక్కేళ హెక్వాహాయితే హార హావున్ప్ మిల్కూలో హీదీ పొట్లం హేసి తీస్కోండి! కాల్వాకీ హడ్డు హేసినట్టు స్టాప్ హావుతాయ్ !

శివ : చిత్రం ! (భీమశంకరంతో) వింటున్నారా సార్ !

భీమ ; (విసుగుతో) వింటున్నాను లేవయ్యా, (బయటనుంచి రాజిత అమరేంద్రలు వస్తారు. ప్రభాకర్ వాళ్ళను, వాళ్ళు ప్రభాకర్ని అర్థంలేనట్లు చూస్తారు) మా అమ్మాయి రాజిత (రాజితతో) వారు ఫారిన్ రిటన్, పెద్ద డాక్టర్ పేరు (ఆగి ప్రభాకర్ని చూస్తాడు.)

ప్రభా : బిస్మిల్లాఖాన్ (నవ్వుతాడు)

రాజి : (నమస్కరించి) నమస్తే !

ప్రభా : (నవ్వుతూ) నమస్తే ! (అమరేంద్రని చూస్తాడు)

భీమ : వారిది నాగపూర్ ! అమరేంద్ర అని పదిలక్షలకు అధికారి, పెద్దవ్యాపారం వాళ్ళది.

ప్రభా : గ్లాడ్ టూ మీట్ యూ (కరస్పర్శ చేస్తారు) వీర్కి హాల్లుడ్ హావుతార్ ?

శివ : లేదు లేదు ! కావాలని ట్రై చేస్తున్నారు. (రాజిత కోపంగాచూస్తుంది.)

భీమ : (మందలింపుగా) శివయ్యా !

శివ : మీరేకాదు సార్ అన్నారు! కుర్రవాడు బుద్ధిమంతుడు. రాజితను యిస్తే బాగుంటుందనీను!

భీమ : అంటే అన్నానేమో! అవన్నీ జరిగేవరకూ నమ్మకం యేది? ముందుగా అల్లరి ఎందుకు? అసలే అమ్మాయి...

రాజిత : నాన్నా! (హెచ్చరికగా చూస్తుంది).

భీమ : చెప్పలేను లేవమ్మా! చెప్పిచేయుకలిగింది లేదని నాకు తెలియదూ?

ప్రభా : హేమ్మీ సార్! హమ్మాయిగార్కి హెల్తు సరీలేదు హనుక్కుంటాం!

రాజి : మా ఆరోగ్యాని కేమీ భంగం రాలేదు! రాదు కూడా! వస్తా! (లోపలకు వెడుతుంది).

ప్రభా : హరేహల్లా! మాటల్లో మర్యాదా బొత్తిగాలేద్! హు!

అమ : మీరేం అనుకోకండి! ఆవిడ నేచరే అది! మనిషి కటువుగా కనిపించినా హృదయం వెన్నకంటే మెత్తన! (నవ్వుతూ భీమశంకరంను చూస్తాడు).

ప్రభా : హదీమీాకీ చెప్పాన్ కన్నా మాకీ తెల్సొనున్నాం!

శివ : తెలివంటే అలావుండాలి సార్! అమరేంద్రగారు యీ యింట్లో అడుగు పెట్టికూడా అయిదు మాసాలుకంటే మించలేదు!

ప్రభా : మీకీ హిడ్లే హుంటార్?

అమ : ఎబ్బే! లేదండి!

భీమ: చెప్పానుగా ఆయన పెద్ద వ్యాపారస్తుడని! తీరుబడి దొరికినప్పుడల్లా అంటే రెండురోజులకీ మూడు రోజులకీ వస్తూంటారు.

ప్రభా: మీది బిజినెస్

శివ: ట్రావిలింగ్

ప్రభా: హంటె ?

అమ: ఎక్స్పోర్టు, యింపోర్టు!

ప్రభా: ఐసీ!

శివ: బాబుగారు పదిరోజులనుంచే కొంచం తీరుబడిగా వున్నారు!

భీమ: పరిచయం కొద్దికాలం క్రితం అయినా అయినవాళ్లకంటె ఎక్కువగా అంటుకు పోయాడు!

ప్రభా: ఐసీ!

అమ: చిన్న పనుంది! మళ్లీ మీటవుతాను! మీ అడ్రసు చెప్పండి!

ప్రభా: మాది హాస్పటల్ హూరుబయట వుండిందీ!

భీమ: ఊరిబయటా!

ప్రభా: హావునుహాండీ! రోగులకీ మంచిగాలి కావాలీ కాదూ? హాందుక్కాహానీ హూరుబయట కట్టించాన్! మాదీ మకాం కూడా హాక్డే!

అమ: అంటే...

ప్రభా : హారె జగ్గయ్య పేటాపోయే రూటు లేదూహాండీ! హూరు దాటాగానే రోడ్డుప్రక్కనా వుండింది మాదీ హాస్పటల్ ! (నవ్వి) హొక్కోక్కి సారీ దయచేయండీ మీకీ!

అమ : అలాగే! (విష్ చేసి గబగబా లోపలకు వెడతాడు)

ప్రభా : మన్షీ మంచివాడ్ హానిపిస్తుండాడ్ !

భీమ : మీలాగా మంచి మాటకారి. (నవ్వుతాడు).

శివ : వారి మాటలు వింటున్నకొద్దీ విసుగులేకుండా వినాలని పిస్తాయ్! (లోపలనుంచి రాజిత యేదో పుస్తకంతో వస్తుంది.)

ప్రభా : కరక్టు! (రాజిత వెనకే అమరేంద్ర వస్తాడు.)

భీమ : మళ్ళీ వెడుతున్నావామ్మా!

అమ : బర్తు డే సెలబరేషన్ సందర్భంలో స్నేహితురాల్కి కానుకగా యివ్వాలనుకొని దాచిన ప్రేమకానుక వెళ్ళేప్పుడు పట్టుకెళ్ళడం మర్చిపోయింది. అది తీసుకెళ్ళడానికే వచ్చింది! (సిగరెట్ వెలిగిస్తాడు)

ప్రభా : (రాజితను రెప్పవాల్చకుండా చూస్తాడు. అది రాజిత గుర్తించకపోయినా అమరేంద్ర అతని చూపుల్ని అనుమానిస్తాడు.)

రాజి : అవును నాన్నా!

భీమ ; తొందరగా వచ్చేయండి తల్లీ!

అమ : అలాగే! (ప్రభాకర్‌ని సమీపించి చిన్నగా వెన్నుతట్టి) వస్తాం!

ప్రభా : (తేరుకొని) గుడీవిసింగ్ !

అమ : గుడీవిసింగ్ !

రాజి : మరోసారి తీరుబడిగా మాట్లాడదాం ! వస్తా డాక్టర్ !
(నవ్వుతూ రాజితా అమరేంద్రలు బయటకి వెడతారు).

ప్రభా : వాళ్ళు వెళ్ళే వరకూ అటే చూసి) భీమ శంకర్ గార్ !
హద్దర్కీ హీడూజోడూ హచ్చాగా కుదిరింది ! నాదీ మాటా
హినీ ...

భీమ : పెళ్ళిచేస్తే బాగుంటుందనే అనిపిస్తోంది ! గానీ అమ్మాయి
వప్పుకు నేట్లు లేదు !

ప్రభా : హేట్మీ హబ్యంతరం ?

శివ : అమ్మాయిగారి దంతా పెద్ద కథ !

భీమ : ఆ కథ నిన్నిప్పుడు చెప్పమనడం లేదు !

ప్రభా : హేమ్టీసార్ హట్టా హంటార్ మీకీ ! మీరూ నాకీ
తండ్రిలాంటివార్ ! మీకు కుమార్తె మాకీ సిస్టర్ సమానం!
నాకీ బోల్టాన్కీ భయం హెందుక్కాహండీ !

భీమ : భయం లేదు బండలూ లేదు ! చెప్పి చింతను పెంచు
కోడం తప్ప కలిశొచ్చేదేం లేదు !

ప్రభా : హమ్మాయ్‌గార్కి మొహంలో హేదో దిగుల్
తొంగీ చూస్తూన్నట్లూ హనిపిస్తోంది !

శివ : డాక్టర్ కాబట్టి గ్రహించారుసార్ ! యదార్థంగా అంతే !
ఆమ్మాయిగారి మనస్సు వికలం అయింది ! యీామధ్య

మరీ మాట వినడం మానేశారు! తనేమో తన పట్టు దలేమో!

భీమ: (మందలింపుగా) శివయ్యా!

శివ: చెప్తేనే మంచిది సార్! వ్యాధి ముదరకుండానే మందిస్తారు. (ప్రభాకర్‌తో) నాలుగయిదు మాసాల క్రితంవరకూ ఎవరి మాట ఎలాగున్నా బాబుగారిమాటకు అడుగు మీరేది కాదు! యిప్పుడు ...

భీమ: ఆ వ్యాస్తంతా యెందుకు!

ప్రభా: పర్వాలేదూ హండీ!

భీమ: నేను చెప్తాన్లే డాక్టర్! (శివయ్యతో) శివయ్యా! నువ్వు బాంకికి వెళ్లి పర్సనల్ అకౌంటులో వున్న నిలవ తెల్సుకుని రా! వెళ్లు!

శివ: చిత్తం! (ప్రభాకర్‌ని చూసి నవ్వుతూ బయటికి వెడతాడు)

భీమ: డాక్టర్! మీ హృదయం విశాలమైందిగా స్పష్టమవుతున్నది. అందులోనూ పెద్దలు అడిగినప్పుడు చెప్పడం కూడా అవసరమనే అనిపిస్తున్నది! కానీ చెప్పింది చెప్పినట్లు మీ హృదయంలోనే వుంచుకుంటానంటే చెప్తాను!

ప్రభా: మీకీ హనుమానం హక్కర్లేద్! చెప్పండీ!

భీమ: మా రాజిత ప్రభాకర్ అనే కుర్రాణ్ణి ప్రేమించింది! అతను కూడా మా రాజితను అమితంగా ప్రేమించాడు!

ప్రభా: హాయితే పెళ్లి చేయండీ! తప్పేహేమిటీ?

భీమ: ప్రభాకర్ విద్యాధికుడు! గుణవంతుడు, అందగాడు, అటువంటి యోగ్యుడు జన్మజన్మాలకూ లభ్యపడడు!

ప్రభా: I see—!

భీమ: పవిత్రంగా నిస్వార్థంగా ప్రేమించుకున్నా ప్రేమికులు రాజిత ప్రభాకర్‌లు! కల్మషం కళంకం లేని వాళ్ళ మనసులు తేట మనసులు!

ప్రభా: I see - పెళ్లికి హేమ్టీ హబ్యంతరం?

భీమ: అంతర్యాలు తెల్సుకోలేని అభగవంతుడు నిర్దాక్షిణ్యంగా పసికందుల మీద కసిచూపించి ప్రభాకర్‌ని తనలో అయిక్యం చేసుకున్నాడు!

ప్రభా: హాంఛె! (దీనంగా చూస్తాడు).

భీమ: అయిదు నెలలనాడు జరిగిన ట్రైన్ యాక్సిడెంట్‌లో స్వర్గస్థుడైనాడు!

ప్రభా: హారె హల్లా! హెంత ఘోరం హండీ! తర్వాతా హేమ్టీ హయిందీ?

భీమ: సర్వం తలక్రిందయింది! పిడుగులాంటి వార్త చెవిన పడగానే అమ్మాయి నిలువునా నీరైపోయింది! ప్రభాకర్‌కి యిచ్చిన మనస్సు అతనికే అంకితంకావాలి, అతగాణ్ణి చూసిన కంటితో మరొకర్ని చూడనని భీష్మించుకు కూర్చుంది! ఎంత చెప్పినా వినిపించుకోదు! తీరని ఆశగా, మారని మనిషిగా బ్రతుకు అంధకార మయం చేసు కుంటున్నది! (ప్రభాకర్ కంటతడి పెడతాడు – భీమశంకరం గమనించి) మీరు కంటితడి పెడుతున్నారా! అవును! దాని

ప్రణయగాథ భరించరాని బాధగా మథనపెడుతూంటే ఎవరు కంటతడి పెట్టకుండా వుండగలరు ? ఎంతటి కఠినగుండె అయినా కరిగి తీరుతుంది !

ప్రభా : నాదీ హూట హినీ హర్కి పెళ్ళిచేయండి మీాకీ !

భీమ : అంగీకరిస్తేనా ? ఈజన్మకి తనకి పెళ్ళే అక్కర్లేదంటుంది ! డాక్టరుగా ప్రజాసేవచేయడానికి నోచుకోని ప్రభాకర్ ఆత్మ శాంతికోసం తను డాక్టర్ చదివి ప్రభాకర్ ఆశయాన్ని అమలు జరుపుతానంటుంది !

ప్రభా : హా రేహల్లా ! హిప్పిడా చేయాలీ హిప్డూ ?

భీమ : మనచేతుల్లో యేముంది ? జరిగిన అన్యాయానికి దాన్ని చూసి నేను, నన్ను చూసి అదీ కుళ్ళికుళ్ళి యేడవడం తప్ప చేయగలిగిందేముంది ?

ప్రభా : మీాకీ దిగులూ పడకండీ ! మీాకీ హిస్టమ్ హాయితే హమ్మాయిగార్కి వప్పించేభారం నాదీమీాదా హేస్కుంటా !

భీమ : వప్పుకుంటుందన్న ఆశ నాకు లేదు !

ప్రభా : హదీ హాశా నాకీ హుండిందీ హండీ ! నాదీ కోర్కా హమ్మాయిగార్ తప్పకుండా తీసుస్తారూ హనీ వుండిందీ నమ్మకం !

భీమ : అంతనమ్మకం మీాకున్నప్పుడు నేను కాదనగలనా ? నిజానికి యీా ముసలి ముక్క అంతకంటే కోరేది యేముంది !

ప్రభా : హాయితే నాకీ చెప్పినట్లూ మీాకీ హాస్పటల్‌లో హెడ్మిట్‌కండీ ! యిక్డావ్యవహారం మాకీ సూస్తామ్ !

భీమ : (ప్రేమగా) బిస్మిల్లా ఖాన్ !

ప్రభా : మాటాహాంటే మాటేనండీ మాదీ! మీకీ సూస్తారుగా! (గడ్డం సవిరించుకుంటూ చిన్నగా నవ్వుతాడు) మరో సందేహం! హమ్మాయిగారితో హుండాలే అమరేంద్రే కాదూ హండీ!

భీమ : అవును! అమరేంద్రే!

ప్రభా : హార్కి మీకీ నచ్చాడూ కాదూ ?

భీమ : అమ్మాయి వప్పుకుంటే అంతమంచి సంబంధం మరొకటి ప్రస్తుతంలో లేదనే అనిపిస్తున్నది!

ప్రభా : I see -!

భీమ : కుర్రాడు బుద్ధిమంతుడు! యోగ్యుడు! ఎప్పటికైనా మనస్సు మారి అతన్ని పెళ్ళాడుతుందన్న ఆశతోనే అమ్మాయితో స్నేహం పెంచుకొని దాని మనస్సు మార్చమని కోరాను అమరేంద్రని! అతనూ శతవిధాలా ప్రయత్నిస్తున్నాడు! అతన్ని గౌరవిస్తుంది! అతనితో కలసి తిరుగుతూంటుంది! అతనిమాట వింటుంది! అభిమానిస్తుంది! ఎంతఅభిమానించినా పెళ్లిమాటెత్తుతే సహించదు! ఆ సంబంధమైన సలహా పాటించదు! ఎవర్నయినా తను పవిత్రంగా సోదర సమానంగా ప్రేమిస్తానంటుంది!

ప్రభా : స్టోరీ మొత్తం హర్థమయిందీ! హిప్డూ చూడండీ! హమ్మాయిగారూ హెట్టా మారిపోతుందో!

భీమ : మీరంత సహాయంచేయాలిగానీ మీ మేలు జన్మజన్మాలకీ మర్చిపోలేను! (బయటనుంచి జగం వస్తాడు) వచ్చావా జగం!

జగం : ఎవరీ పెద్దమనిషి ?

ప్రభా : హిప్పూ పెద్దమన్షి హనే పదాన్కి- హెక్వా అర్థం హుండింనీ ! బుర్కాలు తగ్గీపించుకొని పెద్దమనుషుల్‌గా తిరిగి గోతుల్ తీశేరకం కాదూ హండీ మాదీ ! (నవ్వుతాడు)

జగం : (ప్రభాకర్‌ని అదోలాచూస్తూ) మొత్తానికి ఘాటుగానే మాట్లాడతారే !

భీమ : (నవ్వుతూ) ఘాటుగా మాట్లాడేవాళ్లంతా ఘాతుకులు కాదు జగం ! సభ్యత, సహృదయంగల పెద్ద డాక్టర్‌వారు ! వ్యక్తుల్ని మరమత్తు చేయడంలో దిట్ట ! నా ఆరోగ్యం సరి లేక నేనే పిలిపించాను. వారిపేరు బిస్మిల్లాఖాన్ !

జగం : అలానా ! ఏదయినా వ్యాపారానికి పెట్టుబడి కోరడానికి వచ్చారేమో ననుకున్నానండి !

ప్రభా : పెట్టూబడీ హున్నా లేకున్నా హినీ మానీ వ్యాపారం! (స్టెతస్కోప్ చూపించి) గుండెజబ్బులు నయం చేయడంలో మాకీ స్పెషలిస్టుగా పేరూ పొందాం ! (బయటనుంచి రాజిత అమరేంద్రవస్తారు) భీమశంకరంగార్కి- గుండెజబ్బుహుండింది! వార్కి- చికిత్సా చేస్తేనేగానీ కోలుకోర్ ! అశ్రద్ధచేస్తే హాయనగారూ మీకీ రోజుల్లోనే దూరం హవుతార్ !

రాజి : ఆఁ ! ఏమన్నారు డాక్టర్ !

భీమ : ఆందోళన పడకమ్మా ! పెద్దవాణ్ణి నేనేమయిపోతేనేం ! నాకు మంచులూ మాకులూవద్దని పరీక్ష ఫీజిచ్చి వెళ్లమంటున్నా వినిపించుకోడంలేదు !

అమ: ఆశయాలు పెరిగుంటాయ్! అందుకే డాక్టర్‌గారు మీకు నయంచేసి తీరాలంటున్నారు! (ప్రాపకం పెంచుకోడానికి మంచిపనేగా! (ప్రభాకర్‌ని చూస్తూ) యేండాక్టర్!

ప్రభా: హావున్! హాశయలూ పెరిగిన వార్కి హానకాశాలు కల్గించీ వారికీ రిపేరు చేయడమే మాదీపనీ!

రాజి: యేమయినా సరే! మీరు మానాన్నగార్ని తిరిగి ఆరోగ్య వంతుల్ని చేయాలి! యెంత డబ్బయినా యిస్తాం!

భీమ: (శూన్యంగా) అమ్మాయ్!

రాజి: అవును నాన్నా మీరు మేము అక్కర్లేదనుకున్నా నాకు మీరు కావాలి!

భీమ: అమ్మాయ్!

రాజి: డాక్టర్! మానాన్నగారి కోసం నా ప్రాణాల్నయినా యివ్వదల్చుకున్నాను! మీరు మాత్రం ...

ప్రభా: బాగుచేశే బాధ్యత మాదీ హానీ బోలాంగా! మీకీ ధైర్యంగా హుండండి! యీరోజే భీమశంకరంగార్కి హాస్పటల్ మే హెడ్మిట్ చేస్తాం! మీకీ తోడుగా మిస్టర్ హామరేంద్రను హుంచుకోండి!

భీమ: అలాకాదు డాక్టర్! అమ్మాయికేం తెలియదు! నేను హాస్పటల్లో వుంటేయెలా? మీరు నిత్యం యింటికి వచ్చి చికిత్స చేయండి!

అమ: అవును! అదే మంచిపని డాక్టర్!

ప్రభా: హది హచ్చాగా లేదు మాకీ! హార్కీ హాస్పటల్ మే హడ్మిట్ హయితీరాలీ హండీ! హావ్యాధీ హాటువంట్దీ! ఆ!

భీమ : అంతేనా డాక్టర్ !

ప్రభా : మీాకీ బాధ పడకండీ! మీాదీ హమ్మాయిగార్ మాకీ సిస్టర్‌తో సమానం. వార్కి మంచీ చెడ్డల్ మాకీ చూస్తూ హుంటామ్ !

రాజి : (సంతోషాన్ని అణుచుకుంటూ) డాక్టర్ !

అమ : (నవ్వి) కరక్టు! పదిక్షణాల క్రితం పరిచయం అయినా రాజితకు అన్న లేని లోటు తీర్చారు! (చేయి అందిస్తాడు)

ప్రభా : (చేతికి చేయికలిపి) హవునండీ భావాగార్ !

రాజి : ఆఁ! (బాధపడుతుంది) బావగారు! (విసుగులో చిన్నగా అంటుంది)

ప్రభా : హేమ్మీ హమ్మాయి గార్ ! హట్టాహాయి పోయార్ మీాకీ! మీాకీ హజ్బెండ్ కాకాపోతే మాకీ మన్నించండీ మాకీ!

భీమ : తెలియకన్నారు! పరవాలేదులెండి! అమ్మాయికూడా పట్టించుకోదు !

ప్రభా : (రాజితను చూస్తూ) నాదీ మీాదా మీాకీ కోపం లేద్గాదూ ?

రాజి : (నవ్వుతుంది).

ప్రభా : హచ్చా! (నవ్వి) మాకీ శెల్వాతీస్కుంటాం! బండీ మాట్లాడీ బాబుగార్కి హాస్పటల్‌కీ తోలండీ మీాకీ! బెడ్డూ గిడ్డూ తయార్ చేసి మాకీ హక్డా సిద్ధంగా హుంటాం !

రాజి : ఆలాగే డాక్టర్ !

ప్రభా : వస్తాం ! (రాజిత, భీమశంకరం నమస్కరిస్తారు ! వాళ్ళకు ప్రతినమస్కారంచేస్తూ) హొస్తాం బ్రదర్ ! (అమరేంద్రతో అని జగంను చూస్తాడు) మిస్టర్ యుగం !

జగం : క్షమించాలి నాపేరు జగం !

ప్రభా : హేంటీ హైతే హేమ్మిహాహండీ ! యుగం, జగం, జగడం, రగడం ! హన్ని పేర్లూ పల్కాడాన్కి హొక్కటే హిదంగా హుంటాయ్ ! హదీ హట్టా హుంచండీ ! బాబుగార్కి బద్రంగా హాస్పటల్‌కు చేర్పండి మీకీ !

జగం : అయ్యో ! అంతకంటేనా !

ప్రభా : హొస్తాం సార్ ! హందర్కీ గుడ్‌బై ! (నవ్వుతూ బయటకి వెడతాడు) (రాజిత సన్నగానవ్వుతూ లోపలికి వెడుతుంది. అమరేంద్ర అక్కడే కూర్చుని పత్రిక తిరగేస్తూంటాడు.)

జగం : (భీమశంకరంతో) మీతో అతిముఖ్యమైన విషయాలు మాట్లాడాలని వచ్చాను.

భీమ : సమయం సందర్భం సరిగా లేనందున తటస్తంగా వూరుకునుంటావ్ ! (జగం అవునన్నట్లు తల ఆడిస్తాడు) పరిస్థితి ప్రమాదకరంగా వుందని డాక్టర్ చెప్పాడు. మనస్సు స్థిమితపడినాక మనం తీరుబడిగా మాట్లాడదాం !

జగం : (తెల్లబోయి) అంతేనంటారా ?

భీమ : నువ్వెళ్ళి త్వరగా భోజనంచేసి రా ! హాస్పటల్‌లో అడ్మిట్ అయ్యేవరకూ వెంటుందువుగాని !

జగం : అలాగే ! మరినాకు శెలవా !

భీమ: త్వరగా రా! (జగం వచ్చిన పని కానందున నాలుక చప్పరిస్తూ బయటికి వెడతాడు) అమరేంద్ర!

అమ: సార్!

భీమ: డాక్టర్ ఆంతర్యం అర్థమైందా!

అమ: అర్థమైంది కొంతవరకూ!

భీమ: నా జబ్బు కుదర్చడం కన్న అమ్మాయి మనస్సు మార్చడంలో ఎక్కువ బాధ్యత పెట్టాను అతనిమీద!

అమ: అంటే?

భీమ: అమ్మాయిని పెళ్ళాడాలని త్రికరణశుద్ధిగా వుందికాదూ?

అమ: సందేహంలేదు! రాజితను వప్పించలేకుండా వున్నాను!

భీమ: అధైర్యపడకు! బహుశా దినాల్లోనే అమ్మాయి మనస్సు మారుతుంది! మనస్ఫూర్తిగా నిన్ను ఆహ్వానిస్తుంది!

అమ: అవునా? (మొహం వికసిస్తుంది).

భీమ: ఆ బాధ్యత నేను కోరకుండానే డాక్టర్ బిస్మిల్లాఖాన్ తన మీద పెట్టుకున్నాడు!

అమ: మార్చడం అతని వలన అవుతుందా?

భీమ: శెంటుపర్సెంటు కావచ్చుననే ఆయన ఉద్దేశం!

శివ: (బయటనుంచి వస్తాడు) డాక్టర్ ఉద్దేశమేనా!

భీమ: అది నీకెందుకు? ముందు వెళ్ళిన పనేమయిందో చెప్పు!

శివ: మొన్న కలకటానుంచి వచ్చిన చక్ క్యాష్ అయిందిట! దాంతో కూడా మొత్తం (ఆగి ఆలోచిస్తూ) ఎంతో చెప్పాడమ్మా!

అమ: మళ్లీ వెళ్ళి కనుక్కురా!

భీమ: ఎందుకులే! ఇప్పుడుహాస్పటల్‌కి ఎలాగూ వెళ్లాలిగా బాంక్ దగ్గరబండీ ఆపి నేనే అడిగి పోతాను! శివయ్యా! వెళ్ళి మంచి గుఱ్ఱం కలిగిన జట్కా తీసుకురా!

శివ: ఎక్కడికంటె?

భీమ: ఏటి ఒడ్డుకని చెప్పు. బిస్మిల్లాఖాన్ హాస్పిటల్‌కి!

శివ: అలా చెప్పకూడదూ! (బయటికి వెడతాడు)

అమ: ఈ శివయ్యకూ మీకూ బంధుత్వముందా?

భీమ: దూరపు చుట్టరికం యేడ్చింది!

అమ: ఏమవుతాడు మీకు?

భీమ: ఈరోజు ఛస్తే రేపటికి రెండవుతాడు. ఏమిటయ్యేది?

రాజిత: (లోపలనుంచి వస్తుంది) అవసరమైన సామగ్రి సమకూర్చాను నాన్నా!

భీమ: శివయ్య బండికోసం వెళ్ళాడు. వాడు రాకముందే నీకో రహస్యం చెప్తున్నాను. కడుపులో పెట్టుకోతల్లీ!

రాజి: ఏమిటది?

భీమ: శివయ్య పక్కచుట్ట ఆఫీసు గదిలో పడేయించు. ఎట్టి పరిస్థితిలోనూ వాణ్ణి లోపలకు రానీయకు!

రాజి: ఇప్పుడు యిల్లంతా తిరుగుతూనే వున్నాడుగా?

భీమ: నేనున్నానుకాబట్టి భయంలేకపోయింది! వాడికి ప్రతి పదిరోజులకూ పిచ్చి ఎక్కువవుతుంది! ఆ పిచ్చి ముదిరినప్పుడు యింటికి నిప్పుకూడా పెట్టగలడు!

అమ : అలాంటివాణ్ణి యే వైజాగ్ హాస్పటల్‌కో పంపక యింట్లో పెట్టుకు కూచ్చున్నారేం?

భీమ : వాడు వున్నందువలన మనకు నష్టమూ లేదు కష్టమూ లేదు! గుమస్తా వుద్యోగం యిచ్చి యింట్లోనే వుంచుకుంటున్నాను! యిప్పుడు వాడి గురించి దేనికిలే! (బయట నుంచి శివయ్య వస్తాడు) అదిగో వచ్చాడు!

శివ : బండీ తీసుకొచ్చాను!

భీమ : అమ్మాయ్ నేను వెళ్లిరానా?

రాజి : వెళ్ళిరండి నాన్నా! (శివయ్యతో) శివయ్యా! లోపల నాన్నగారి బెడ్డింగుచుట్ట, ప్లాస్టిక్ బేగ్ వుంది! తీసుకొచ్చి బండీలో పెట్టు!

శివ : మీరెళ్ళి బండీ ఎక్కండిసార్! అవి నేను తెస్తాను! (లోపలకు వెడతాడు).

భీమ : అమ్మాయ్! అమరేంద్ర నాతో హాస్పటల్ వరకూ వస్తున్నాడు! నేను తిరిగి వచ్చేవరకూ అతన్ని మనింట్లో వుండమని కోరుతున్నాను!

రాజి : అలాగే నాన్నా!

భీమ : అమ్మాయి ఆమోదం అయింది! మరి నీకేమయినా అభ్యంతరమా అమరేంద్రా!

అమ : మీ కోరిక ప్రకారం అలానే వుంటాను!

శివ : (లోపలనుంచి బెడ్డింగుచుట్ట, ప్లాస్టిక్ బాగ్ పట్టుకొనివచ్చి) అరె! యింకా యిక్కడే వున్నారా! అయిదయిందా

అంటే హాస్పటల్ గేటు మూశేస్తారు సార్ ! త్వరగారండి పోదాం! (బెడ్డింగు ప్లాస్టిక్ బాగ్‌లతో బయటకి వెడతాడు)

భీమ : పోయి వచ్చేదామ్మా!

రాజి : పదండి నాన్నా !

భీమ : బయల్దేరు అమరేంద్ర ! (అమరేంద్ర, రాజిత, భీమ శంకరంలు బయటకి వెడతారు) మరో రెండు నిమషాల్లో బండి బయల్దేరి వెళ్లిన చప్పుడు వినిపిస్తుంది. తర్వాత రాజిత తిరిగి లోపలకు వస్తుంది. ఎదురు గోడకున్న కిటికీ తలుపులు మూసి వెనక్కి తిరిగేసరికి గోవిందు బయటనుంచి వస్తాంటాడు)

గోవిం : మా గురువుగారు ఎక్కడికి వెళ్లారు ?

రాజి : వారితో యేమయినా చెప్పాలా ?

గోవిం : ఏముంది చెప్పడానికి. యివ్వాళ బ్యాంకిలో వేయడానికి బాలన్స్ మిగలలేదని చెప్పాలి ! రావాల్సిన మొత్తాలూ అంతగారా లేదు !

రాజి : చెప్తాన్లే !

గోవిం : ఇంట్లో మీరుతప్ప ఎవరూ కనిపించరేం ?

రాజి : (వ్యంగ్యంగా) అందరికీ చెప్పాల్సిన విషయా లేమయినా వున్నాయా !

గోవిం : మీరు మరీ చమత్కారంగా మాట్లాడతారే! (నవ్వుతాడు.)

రాజి : సరేగానీ మీ గురువుగారి వ్యాపారం యేమిటన్నావ్!

గోవిం: ఆయనగారు చెప్పేవుండాల్నే!

రాజి: ఇప్పుడు నువ్వు చెప్పరాదూ?

గోవిం: ఎక్స్పోర్టు, ఇంపోర్టు అని యిదివరకే చెప్పానుగా! వ్యాపారం సరుకు డీలింగ్స్ కంటే కాష్ డీలింగ్సే ఎక్కువ.

రాజి: అలాగా!

గోవిం: గురువుగారిది మా గొప్పబుర్ర! అంతా బంగారమే కదండీ!

రాజి: నీ బుర్రంతా మట్టితో నిండివుందా?

గోవిం: వూరుకోండమ్మగారూ! నన్ను ఎగతాళి చేస్తారు!

ప్రభా: (బయటనుంచి వస్తాడు) భీమశంకరంగార్!

రాజి: అరె! యిప్పుడే వెళ్లారే!

ప్రభా: మాకీ పోకపోయినా ఫర్వాలేద్! మొత్తం ఫోనులోనే హారంజిచేశేస్తాం! (నవ్వుతూ టెలిఫోన్ వేపు వెడతాడు) ఏదో నెంబరు టరన్ చేస్తూంటాడు.)

గోవిం: మీ యింటికి చుట్టాలు వచ్చారా అమ్మాయిగారూ!

ప్రభా: హలొచ్చాం, హలొచ్చాం! (రాజితను చూసి చిన్నగా నవ్వుతూ రసీవర్ పైకితీసుకుంటాడు.)

గోవిం: మా గురువుగారువస్తే నేను లాడ్జింగ్‌కి వెళ్లానని చెప్పండి!

రాజి: పరవాలేదు వుండు!

గోవిం: వుండటానికి కాదు నాకు అవతల అర్జంటు పనుంది!

ప్రభా : పనీ హుండావార్కీ ఎందుక్కా హోపుతాన్! పోనీయండీ! (నవ్వుతూ) హాలో! (గోవిందు నవ్వుతూ బయటకి వెడతాడు) హూ ఈజ్ స్పీకింగ్? ప్రభాకర్! (ప్రక్కగా రాజితను చూస్తాడు) డాక్టర్! బిస్మిల్లాఖాన్ స్పీకింగ్ ... భీమశంకరం ఘూర్ వస్తూహుండార్! యీా పాట్కీ హోొచ్చీ హుంటార్ కూడా వార్కీ స్పెషల్ బెడ్ యేర్పాటూచేయమనీ మాదీ హుకుంగాబోలో! ... హేవ్వీనే హుంటార్? ... హ ... హ ... మాకీ వేగంగా హోొస్తాం! ... గుడీవినింగ్! (రిసీవరు పెట్టేస్తాడు).

రాజి : ప్రభాకర్ ఎవరు?

ప్రభా : కొత్తగా పెట్టీనా కాంపోండర్ హుండీ! హిప్డూ హోొచ్చిన కారణం మీాకీ హర్థమ్ హయిహుంకదు!

రాజి : మీారనేది ...

ప్రభా : హాసల్ సంగతీ మీాకీ చెప్పాడాన్కీ హోొచ్చామ్! మన హిద్దరమ్ మాట్లాడేటప్డూ హితరుల్ హుండాకూడద్!

రాజి : (అర్థంకానట్లు చూస్తూ) అంటే?

ప్రభా : హాడిగినదాన్కీ జవాబ్ బోలండి! మీాకీ నిఖా హంటే పెళ్లీ హెందూక్కా హోొద్దూ హన్నార్?

రాజి : అది నా వ్యక్తిగత విషయం! నాన్నగారి గుండెజబ్బుకీ దానికీ సంబంధమేమిటి?

ప్రభా : మీాకీ తెల్వానీ సంబంధం చాలా హుంఁడిందీ!

రాజి : యేమిటది?

ప్రభా : మీాకీ చెప్కాపోయినా మాకీ హంతా తెల్సున్!

రాజి : ఏం తెల్సును మీకు ?

ప్రభా : బోల్తా హినుకోండి ! మాకీ సిస్టర్ గా మీకీ చెప్తున్నాన్ ! ప్రేమించిన వాడూ దక్కాకనందుక్కా పెళ్లీ పేర్ హెత్తద్దనీ బోలార్ మీకీ! లేకా లేకా పుట్నా హాక్తే బేటీ హైనందుక్కా మీదీ పెళ్లీ గురించే మీకీ నాన్నగార్కి దిగ్లూ పట్టుకుండాద్! హా దిగ్లూ ఎక్వాహాయింది! చివరికీ గుండె జబ్ కిందా దింపిందీ !

రాజి : ఆఁ ! నాన్నగారి గుండెజబ్బుకి కారణం నేనా !

ప్రభా : సందేహం లేద్ ! డాక్టర్ గా మీకీ సలహాహిస్తుండాన్ ! మీకీ పెళ్లీహయితే మీది తండ్రి బ్రతుక్కుతార్ ! లేకా పోతే గయామార్ !

రాజి : (విస్లేక) డాక్టర్ గారూ !

ప్రభా : ఇట్లాంటివార్తల్ శీక్రెట్ గా బోలాలీ! హందేకే హిప్డూ హొచ్చిందీమాకీ! మీకీ హిష్టమ్ హుంటే వేగం మగణ్ణి కట్కోండీ! లేదూ హంటే మళ్ళీ చెప్పాల్సినా పనీలేద్ ! డెఫినెట్ గా మీదీ ఫాదర్ మర్గయా హవుతార్ !

రాజి : డాక్టర్ ! నన్ను వేధించకండి! ఎటూతోచని సందిగ్ధంలో పడి నలిగిపోతున్నాను. మనస్ఫూర్తిగా ప్రేమించి దూరమైన ప్రియునికోసం నా బ్రతుకుని అంకితం చేసి పవిత్రంగా జీవితాన్ని గడపాలనుకున్నాను. కానీ ...

ప్రభా : కానీ గీనీల్తోకల్సీ హొచ్చేదేం లేదూ హండీ ! పోయిన వార్కోసం బ్రతికీ హుండావార్ని దూరం చేస్కుంటారూ హండీ ! హందులో కన్నతండ్రీకాదూ హండీ ! హా రేహల్లా !

లోకంలో ఎంతమోసం జర్గూతూంది! (నాలుక చప్ప రిస్తాడు) నాకూ మొత్తం తెల్సూనండీ! మీకీ పెళ్ళికీ హాప్పుకోర్! హార్కీ హెట్టాగూ బ్రతకర్! మాకీహేదో హొక్టీ చెప్తే మంచిదిమీకీ! మీకీసరే హంటే హాయనీకి మంచీమంచీ మందుల్ హిచ్చీ హారోగ్యం బాగుచేస్తామ్! కాదూ హంటే ఓర్గూబండీలో పంపీహేస్తామ్! మధ్యనా మాకీ హెందుక్కా పాపం! బోలండీ!

రాజి: (శూన్యంగా చూస్తూ) డాక్టర్!

ప్రభా: బోలండీ! మీకీ జవాబ్! మాదీమాటా హింటారా హినరా!

రాజి: నన్ను నిర్బంధించకండి! ఎటూతోచక నామెదడు నలిగి పోతున్నది! నన్ను ఆలోచించుకోనీయండి! (స్థాయితగ్గించి చిన్నగా) నన్ను ఆలోచించుకోనీయండి!

ప్రభా: వప్పూకున్నాం! బాగా హాలోచించే మాకీ బోలండి మీకీ! హంతవరక్కా సరైన మందుల్ మొదల్ పెట్టమ్! ఆ!

రాజి: డాక్టర్!

ప్రభా: రెండూ మాటల్ చెప్పేవాణ్ణీ కాదూమాకీ! తిర్గి టుమాహో హొస్తాం! మీదీ జవాబ్ చెప్పండి మాకీ! హొస్తాం! (రాజితను అదోలా చూసి చమ్మగిల్లిన కళ్ళను కర్చీఫ్‌తో అద్దుకుంటూ బయటకి వెడతాడు).

రాజి: ఇది నాకొక అగ్ని పరీక్షగా నిలిచింది! స్వర్గస్థుడైన ప్రభాకర్‌కి జీవితంఅంకితం చేయడమా? కడుపులో పెట్టుకు

పెంచి పెద్ద చేసిన తండ్రికోసం ఆశయాల్ని చంపుకొని పెళ్ళాడడమా! యేం చేయాలి? (రాజిత నీడ ఒక ప్రక్క నుంచి సమీపిస్తుంది. రాజిత అటే ఆశ్చర్యంగా చూస్తుంది) యేంచేయాలి?

నీడ: ఈ ప్రశ్నకు నీకు సమాధానం చిక్కుతుందని ఆశిస్తున్నావా!

రాజి: అవును! ఆశిస్తున్నాను! కర్తవ్యం కోసం ఆలోచిస్తున్నాను!

నీడ: ఆలోచించి లాభంలేదు! నీతండ్రి కోరిక ప్రకారం పెళ్లాడి సుఖపడు!

రాజి: అంతేనా!

నీడ: అందువలన నీ తండ్రి తిరిగి ఆరోగ్యవంతుడు అవుతాడు.

రాజి: ప్రభాకర్‌కి యిచ్చినమాట!

నీడ: మర్చిపో! మాటనేకాదు మనిషినికూడా మర్చిపో! అతను బ్రతికుంటే నిన్ను తప్పకుండా పెళ్ళాడేవాడు! రోజులు కలసి రాకపోవడంలో కాలం తీరి గతించాడు! పోయిన వాళ్ళ ఆత్మశాంతికోసం బ్రతికున్న వాళ్ళ భవిష్యత్తుని నాశనం చేసుకోడం అవివేకం! అవమానం!

రాజి: అవును!

నీడ: అయినప్పుడు నీకోసం కాకపోయినా నీ తండ్రి ముద్దు ముచ్చటకోసమన్నా పెళ్లాడటానికి అంగీకరించు!

రాజి: అంగీకరిస్తాను. కానీ ...

నీడ: కళంకంలేని నిన్ను స్వీకరించడానికి అమరేంద్ర సిద్ధంగా వున్నాడు! నీవెంట తిరుగుతున్నది, నీ పరిచయాన్ని పెంచుకున్నదీ నిన్ను పెళ్ళాడాలన్న దృక్పథంతో నేనన్న యదార్థం మరువకు! అతను నిన్ను పవిత్రంగా ప్రేమిస్తున్నాడు.

రాజి: అమరేంద్ర ...

నీడ: అనామకుడు కాదు! రూపం, గుణం, ధనం అన్నీ వున్న ఆదర్శమూర్తి! నిన్ను మెచ్చేవాడు నీకు నచ్చినవాడు ఒక్క అమరేంద్ర మాత్రమే! అతన్నే పెళ్లాడు?

రాజి: (పొంగిపొర్లే దుఃఖంతో) తప్పదా?

నీడ: తప్పదు! తప్పదు!! తప్పదు!!! (నీడ క్రమేపీ దూరమవుతుంది)

రాజి: (తెల్లబోయి చూస్తూ) తప్పదు... (బయట నుంచి అమరేంద్ర వస్తాడు) తప్పదు ... తప్పదు!

అమ: ఏమిటి తప్పనిది?

రాజి: (తేరుకొని) ఏంలేదు! (అమరేంద్రని అదోలా తెల్లబోయి చూస్తుంది)

అమ: ఏమిటి అలా చూస్తారు! రూపంలో మార్పువచ్చిందా?

రాజి: అని నేననుకోడంలేదు!

అమ: మరేమనుకుంటున్నారు?

రాజి: ఏదో అనుకుంటున్నాను!

అమ: ఎవర్ని గురించి?

రాజి: మీగురించే!

అమ : నాగురించి అయినప్పుడు నాకు చెప్పడానికేం ?

రాజి : అయినవాళ్లు కాకపోయినా అభిమానించి మాకు సహాయం చేస్తునందుకు మిమ్మల్ని అభినందించాలి !

అమ : చాలా థాంక్స్.

రాజి : మిమ్మల్ని వొకటడగనా ?

అమ : మీా రడగాలనే నేను ఎదురుచూస్తున్నాను !

రాజి : కారణం తెల్సుకోవచ్చా !

అమ : అభిమానం !

రాజి : నామీాద మీా కెందుకింత అభిమానం !

అమ : చెప్తే మీారు చిరాకుపడతారేమో !

రాజి : అది నా అలవాటు కాదు !

అమ : కానప్పుడు కపికరించడానికేం !

రాజి : ఏవిషయంలో ?

అమ : నన్ను పెళ్లాడేందుకు !

రాజి : నన్ను మీారు ప్రేమిస్తున్నారా !

అమ : అవసరం అయితే ప్రాణం యిస్తాను.

రాజి : ఊఁ ! (నవ్వి) యివ్వండి చూస్తాను.

అమ : తీసుకోడానికి మీారు సిద్ధంగా వున్నారా ?

రాజి : కానుక నిరాకరించే అలవాటు లేదుగా !

అమ : అంటే, మీారు నా ప్రేమను అంగీకరించారా ?

రాజి : అనియేముంది !

అమ : (నీరసంతో) లేనప్పుడు పదేపది అడగడం దేనికి ?

రాజి : మీా ప్రేమలో స్వార్థం వుందా ?

అమ : నా హృదయ పంజరంలో మిమ్మల్ని శాశ్వతంగా బంధించాలన్న స్వార్థంతప్ప మరేంలేదు ! మీా మీాద నా కేలాంటి పవిత్రమైన ఉద్దేశం వుందో వేరే చెప్పనక్కర్లేదు ! నేనెంతో కాలంనుంచి మీా మీాద యెన్నో ఆశలు పెట్టు కున్నాను ! మీా రెన్నిసార్లు తిరస్కరించినా మీా మీాదున్న మమకారం నన్ను విడవడంలేదు ! అంగీకరిస్తే ఆదర్శంగా పెళ్లాడతాను ! కాదా భగ్న ప్రేమికుడుగా నీనామ స్మర ణతో జీవితం సాగిస్తాను !

రాజి : (అతని కళ్లలోకి చూస్తూ) అమరేంద్రా !

అమ : రాజితా ! (దగ్గరకు తీసుకుంటాడు).

రాజి : మీామనసు తెల్సుకో లేక మిమ్మల్ని ఒకప్పుడు ...

అమ : పరాభవించావన్న బాధలేదు ! ప్రేమ ఫలించిందని సంతోషిస్తున్నాను ! అప్పట్లో నీలేత మనసుని నేనే నొప్పించి వుంటానని ...

రాజి · అనుకున్నా ఈనాటి మీా తేటమనసు తెల్సుకున్నానుగా !

అమ : పెళ్ళికి అంగీకరించినట్లేగా !

రాజి : ఇంకా అనుమానమా !

అమ : రాజితా ! (బయటనుంచి జగం, శివయ్యలు వస్తారు.)

రాజి : అమరేంద్రా! (యిద్దరూ కౌగలించుకుంటారు.)

జగం : ఆ ఆ! (అమరేంద్ర రాజీతలు విడిపోతారు.) ఒకచంపన భీమశంకరంగారు చావుబ్రతుకుల మధ్య తూగుటూయల వూగుతూంటే మీరిద్దరూ ఆయనగురించిన ఆలోచన లేకుండా ప్రణయకలాపం ప్రారంభించారా?

అమ : ఇద్దరం పెళ్ళాడబోతున్నాం.

జగం : ఎవర్నడిగి?

రాజి : ఒకరి నొకరు అడిగి!

జగం : సమాధానం సవ్యంగా లేదు! పెద్దవాడు బ్రతికుండగానే మీ యిష్టమన్నమాట!

శివ : మధ్య మీకు కష్టం దేనికి? వాళ్ళిద్దరూ ప్రేమించుకోవా లనే మామయ్య ఆశయం!

జగం : అదేదో యిప్పుడే వెళ్ళి తెల్సుకుంటాను!

శివ : తెలివి తెల్లారినట్లే వుంది! వెళ్ళిరండి!

జగం : వెళ్ళడం కాదోయ్! కళ్లు తెరిపిస్తాను! ఆ!

రాజి : ఇప్పుడు కళ్ళు తెర్చుకునే వున్నాం (వస్తున్న నవ్వుని ఆపుకుంటుంది) మీ కంటే ముందు నేనే వెళ్లి చెప్తాను!

జగం : ఆఁ!

శివ : ఆ! మీరింటికి వెళ్ళి రెస్టు తీసుకోండి! రాజిత అమరేంద్ర లను చూసి నవ్వుతాడు).

జగం : తండ్రి సంపాదిస్తున్న పేరు ప్రతిష్ఠలకి, కూతురు ఆడు తున్న చాటుభాగవతానికి సరిపోయింది! మా అమ్మాయి

అంత బుద్ధిమంతురాలు యుండీయూ అంతా గాలించినా లేదని లేత సొరకాయలు తెగకోశేవాడు !

శివ : కోసిన సొరకాయలన్నీ నీభుజానే వేస్తున్నాడుకదా ! పెచ్చన్నా వృధా కాకుండా తింటానికినువ్వుండగా ఆయనకేం కొదవ ? యిప్పటికైనా ఆయనగారి గౌరవం ఎంతవరకుందో తెలిసిందికాబట్టి, ఆయిన్తోవున్న డీలింగ్స్ కట్ చేసుకోండి ! (ముగ్గురూ నవ్వుతారు, జగం ఉడుకుమోత్తనంతో గబ గబా బయటకి వెడతాడు.) వీడికేదో పెద్ద పనువుండి చచ్చినట్లు యితరుల్ని విమర్శిస్తాడు యిడియట్ !

అమ : మనం వెడదామా హాస్పటల్‌కి !

రాజి : ఊఁ !

శివ : తక్షణం వెళ్లండి ఎందుకైనా మంచిది !

రాజి : మరియిల్లు ?

శివ : ఎక్కడికీ పారిపోకుండా మీరు వచ్చేవరకూ పట్టుకు కూర్చుంటానుగా !

అమ : (నవ్వి) శివయ్య చమత్కారంగా మాట్లాడతాడు !

శివ : సహకారంలేని చమత్కారం ఎందుకు ?

రాజి : ఎందుకైనామంచిది. బెడ్‌రూమ్‌కి తాళంపెట్టి వస్తాను.

శివ : ఇంట్లో తిరిగేమనిషి మీద అంత నమ్మకమన్నమాట !

అమ : మీనాన్నగారు చెప్పింది పదిహేను రోజులకు వొకసారి అనికదా ! యివ్వాళబాగానే వున్నాడు. యింతలో తాళం దేనికి ?

శివ: తుంటరిని కాకూడదు కానీ, అయితే యీ తాళాలు ఆగుతాయా! (నాలుక చప్పరించి) ఏమిటో అనుమానం!

రాజి: వచ్చేవరకూ యిల్లు కదలకుండా జాగ్రత్తగా చూస్తాంటావా?

శివ: మన ముండగా యిల్లు కదలడమే! కదిల్తేమాత్రం ఎక్కడికి పోతుంది? (నవ్వి) మీకెందుకు మీరు పోయిరండి! (రాజిత అమరేంద్రులు ఒకరి నొకరు సైగచేసుకొని బయటకి వెడతారు) కొద్దిక్షణాలు అక్కడే నిలబడి దిక్కులు చూసి యేదో యోచిస్తాడు) ఒరేయ్ శివయ్యా! నువ్వింత వరకూ మతిచెడినవాడుగా యీ యింట్లో చలామణి అవుతున్నావ్! యిప్పుడు చూపించరా నీ తెలివిని! యిప్పుడు పాటించారా నీ ధర్మాన్ని! (నవ్వుతూ ఎడంవేపు గుమ్మం వరకూ వెళ్లి బయటకి తొంగిచూస్తాడు) హుఁ! నిజానిజాలు బయటికి వెళ్ళకక్కే సమయాన్ని వృధాచేయకూడదు! యింతకు మించిన సమయం మరొకటిరాదు. క్షణం ఆలోచించి వేగంగా లోపలకు వెడతాడు. బయటనుంచి ప్రభాకర్ వస్తాడు.)

ప్రభా: హారె! హిల్లూ హలొద్దీ పెట్టీ హెక్డాకే ప్యార్? కుడి వేపు గుమ్మంవరకూ వెళ్ళి తొంగిచూసి నాలుక చప్పరిస్తాడు) రాజితా హమరేంద్రలు కహా చల్తీ! (నిట్టూర్చి) సరి! (రిస్టువాచి చూసుకొని అక్కడున్న కుర్చీలో కూర్చుని సిగరెట్ వెలిగిస్తాడు. రెండుక్షణాలకు ఏదో తాళాలు పగులగొట్టిన చప్పుడు వినిపిస్తుంది. ప్రభాకర్ అనుమానంతో తృళ్ళిపడి లేచి నుంచుంటాడు. అర్థం కానట్లు లోపలకు

చూస్తాడు. మళ్ళీ చప్పుడు ఆగిపోయింది. ప్రభాకర్ కూర్చో పోగా మళ్ళీ వినిపించి తృళ్ళిపడి నిలబడతాడు. అంతలో యేదో కవరు పట్టుకొని శివయ్య గబగబా కంగారుతో లోపలనుంచి పరుగెత్తుగొస్తాడు.) శివయ్యా! (తెల్లబోయి చూస్తాడు)

శివయ్య: (ఆగి) మిస్టర్ బిస్మిల్లాఖాన్! నేను శివయ్యను కాదు. నాపేరు శివశంకర్! భీమశంకరంగార్కి వేలువిడిచిన మేనత్త కొడుకుని. జగం అన్న కొడుకుని!

ప్రభా: హేమ్టీ! నీకీ మైండూ తక్వాహాయినా శివయ్యవీ కాదూ?

శివ: అనే అందరూ అనుకుంటూరు! అంటానికి కారణం నా నటన! నటించడానికి కారణం చెప్తున్నాను వినండి! జగం నాకు సాక్షాత్తూ పినతండ్రి, చెప్పుకోడం సిగ్గుచేటు! ఎప్పుడూ ఎదుటవాడి నెత్తిన చేతులు పెట్టడానికి ప్రయత్నిస్తూంటాడు! అన్నదమ్ముల పంపకంలో వచ్చిన ఆస్తి మొత్తం ఆర్పుకున్నాడు! పైతుండుతో భార్యాపిల్లలతో నడివీధిన నిలిచాడు! తోడబుట్టినవాడని తమ్ముడన్నా మమ కారంతో చేరదీశారు! మానాన్నగారు పోయేవరకూ చెప్పుక్రింద తేలులాగా పడుండి ప్రాపకం పెంచుకున్నాడు! నటనతో మంచివాడుగా మాఅమ్మని నాన్నని నమ్మించాడు! మా నాన్నగారు చనిపోయాక అవిశ్వాసపాత్రుడుగా మా అమ్మని మోసగించి ఆమెచేత తెల్లకాగితాల మీద సంతకాలు చేయించాడు, అప్పట్లో నేను మైనర్ని కానడంతో నా ప్రమేయంలేకపోయింది!

ప్రభా : సంతకాల్ చేసినా వైట్ పేపర్సు హేమ్టీ చేశాడ్ ?

శివ : ఏంచేస్తాడు ? మొత్తం ఆస్తి అప్పులు తీర్చే నిమిత్తంగా భీమశంకరంగార్కి తన స్వాధస్తూతైన వ్రాసిచ్చాడు. నాకు మైనార్టీ వెళ్లేవరకూ అంతా కలిసేవుండేవాళ్ళం! తర్వాత తెలివిగా నన్నూ మా అమ్మగార్నీ బయటకి నెట్టాడు!

ప్రభా : హావునూ! హాస్తీ తన పేర్రాహుంచు కోకుండా భీమ శంకరం ఘార్కి హెందుక్కా వ్రాశాడ్ ?

శివ : వాళ్లిద్దరికీ దూరపు చుట్టరికంతో పాటు లోపాయికారీ వ్యవహారాలు, యిచ్చిపుచ్చుకోడాలు వున్నాయ్! అస్తి కిమ్మతు కట్టి సగానికి సగం ముట్ట చెప్పినట్టు తర్వాత తెలిసింది! యీనాటికీ ఆయిద్దరూ ఉమ్మడిగా చేస్తున్న మోసాలు యెన్నో వున్నాయ్!

ప్రభా : హైసాబోలో! తర్వాత హేమ్టీ హాయిందీ ?

శివ : వుంటానికి పంచ తింటానికి తిండిలేని నాకూ మా అమ్మకీ భీమశంకరంగారు తనింట్లో స్థానం కల్పించాడు!

ప్రభా : హాయిన్కీ హేమ్టీ పనీహుండాద్ ?

శివ : తను అల్లరికాకుండా వుంటానికి దూరపు చుట్టరికం అడ్డు పెట్టి అవకాశం యిచ్చారు. ఆయివ్వడం మా అమ్మగార్కి వంటమనిషిగాను, నాకు గుమాస్తాగిరి యిచ్చేడు! తర్వాత మా అమ్మకి విషజ్వరం వచ్చి మరణించింది! నేను వంటరి వాణ్ణయినాను! మా అమ్మ సంతకాలు చేసిన కాగితాలు చేచిక్కించుకుంటే యిద్దరు మిత్రులకీ సంకెళ్లు వేయించ వచ్చు! ఆ కాగితాలు చిక్కడం కష్టమయింది! జగంతో

వైరం పెంచుకోలేదు! బంధుత్వంకూడా లేనట్లే నటిస్తున్నాను! క్రమేపి మైండ్ చెడినవాడుగా, అమాయకుడుగా నటన ప్రారంభించాను! ఆ కాగితాలు భీమశంకరం గారు తను పడుకునే పందిరిమంచం సొరుగులో పెట్టి దాచి నట్లు పసికట్టాను. నన్ను ఆ గదిలోకి మినహా యిల్లంతా తిరగనిచ్చేవాళ్లు. సంవత్సరాలుగా ప్రయత్నిస్తే మా అమ్మ సంతకంచేసిన కాగితాలు యీనాటికి చేజిక్కినాయ్!

ప్రభా: హింట్లోచేరీ హింటీవాసాల్ లెఖ్ఖా పెట్టినట్లూగాహుందీ మీకే పని!

శివ: వాళ్ళు చేసినపనే నేను చేశాను! మోసగాళ్ళను మోసంతోనే తుద ముట్టించాలి! యిక చూపిస్తా యీ పిచ్చివాని ప్రతాపం!

ప్రభా: హేమ్టీ శేస్తార్!

శివ: అక్రమంగా ఆస్తి వ్రాయించుకున్న భీమశంకరానికి, పోర్జరీలుచేసి అప్పులు సృష్టించి, స్వదస్తూరిన వ్రాసియిచ్చిన జగానికి అరదండాలు వేయించి శ్రీకృష్ణ జన్మస్థానానికి సాగనంపుతాను.

ప్రభా: హిప్డూ మీకీ హదీబాపత్ కాగితాలు హెల్లా చిక్కాయ్? హెక్డా చిక్కాయ్?

శివ: రాజిత అమరేంద్రను పెళ్ళాడడానికి అంగీకరించింది!

ప్రభా: (సంతోషంతో) హేమ్టీ బోలావ్!

శివ: ఇంతకాలంనుంచీ పెళ్ళికి నిరాకరించిన రాజిత యిప్పుడు అమరేంద్రుని పెళ్లాడటానికి అంగీకరించింది!

ప్రభా : హారె హల్లా! హెంతామంచీపనీ చేసిందీహాండీ! నాదీ మనస్సు పొంగిపోతోంది హాండి!

శివ : నామనస్సు ఉడికిపోతున్నది! వాళ్లిద్దరూ పెళ్లాడ నిర్ణయించుకున్న శుభవార్త తండ్రికి చెప్పడానికి హాస్పటల్‌కి వెళ్ళారు! తిన్నగా పడకగదిలోకి వెళ్ళి తాళాలు పగలగొట్టాను! కాగితాలున్న కవరు చేజిక్కించుకున్నాను! యిదిగో కవరు! (చూపిస్తాడు) నాటకంలో అంతర్నాటకానికి నాంది ప్రస్తావనగా యిప్పుడే యిద్దరి మీద కేసు బనాయిస్తాను! తర్వాత ఫలితాలు మీరే ప్రత్యక్ష నిదర్శనంగా చూద్దురుగాని, వస్తా! (వెళ్ళబోతాడు).

ప్రభా : హారే హాగవయ్యా! (రెక్కపట్టుకొని ఆపుతాడు) నాకీ భీమశంకరంఘూర్కీ చెప్పీ నీదీ హాస్తి నీకీ రాయించీ హేస్తాన్! మాందీ మాటా యినీ నీకీ గప్‌చిప్‌గావుండు!

శివ : అవకాశంలేదు! మీరు నన్ను యీ విషయంలో నిర్బంధించకండి! ఆవేశంలో పనులు జరిగినంత వేగంగా ఆలోచనలో పడితే జరగవు!

ప్రభా : మాకీచెప్పింగీ హింటే మంచీ డబ్బూహిప్పిస్తా!

శివ : నాకెత్తుధనం గుమ్మరించినా అడుగు వెనక్కివేయను!

ప్రభా : (మందలింపుగా) శివయ్యా!

ప్రభా : బిస్మిల్లా ఖాన్‌గారూ! యిది నా స్వవిషయం! మీరు కల్పించుకోడం అనవసరం! వస్తా! (వెళ్లబోతాడు. అంతలో టెలిఫోను రింగవుతుంది. శివయ్య రిసీవర్ అందుకుంటాడు) ఎవరండీ? ... అ ... అవును ... నేనేశివ

య్యాని, అయామ్‌సారీ! శివశంకరంను! ... మీరెవరు?
... అమరేంద్ర! ... ఏమిటి విశేషం? ... ఆ! ...
ఏమిటి! రాజిత పెళ్లివార్తవిని భీమశంకరంగారికి సంతో
షంలో గుండె ఆగిపోయిందా?

ప్రభా: హా! హేమిట్టా హన్నార్? (అడుగు ముందుకు వేస్తాడు)

శివ: (విసిపించుకోకుండా) భీమశంకరంగారు మరణించాడా!
(డాక్టర్‌ని చూస్తాడు) డాక్టరా! యిక్కడేవున్నాడు!

ప్రభా: (గట్టిగానిట్టూర్చి నెమ్మదిగా) భీమశంకరంగారు మర
ణించాడు! (శివయ్య రిసీవరు పెట్టేసి నోటినిండా పైతుండు
కుక్కుకొని ప్రభాకర్‌ని సమీపిస్తాడు) హంతా పనిహాయిందీ
హాండీ! (విచారంగా) భీమశంకరం మరణించాడు! (తేరు
కొని) హాస్పటల్‌కీ పోదాం పదండి! (యిద్దరు వెళ్లబోతారు)

తె ర



# తేటమనసులు

## 3 వ రంగము

[రంగాలంకరణంతా మొదటి రెండు రంగాలమాదిరే వుంటుంది. రాజిత రెప్పవాల్చకుండా ఆలోచిస్తూ దిగాలుపడి కూర్చుని వుంటుంది. తెరలోనుంచి పాట వినిపిస్తుంది.]

— పాట —

(సాకి) భగవానుని దృష్టిలో నీ బ్రతుకే మహాపాపమా !
అయ్యొయ్యో ! అంధకారమే నీకు శరణ్యమా ...

(చరణం) ఏమిటో యీ కథ
ఏమో తెలియని బాధ
ఏపాపమెరుగని ఇల్లాలిగాథ
ఏల నీ తేట మనసుకీకోత ॥ఏమిటో॥

ప్రేమించిన ప్రియుడు దూరమాయె
కనిపెంచిన తండ్రి కరువాయె
పెళ్లాడిన భర్తకు బరువాయె
దరిలేని నీ బ్రతుకే భారమాయె ॥ఏమిటో॥

(బయటనుంచి ప్రభాకర్ నెమ్మదిగా వస్తాడు. అతన్ని చూసి ఆలోచనలో వున్న రాజిత తేరుకొని లేచి నిలబడుతుంది.)

ప్రభా: హమరేంద్రనుండి హుత్తరం రాలేదు కదూ!

రాజి: లేదు.

ప్రభా: హరే! హాయన్కి హేట్టా బడామన్సియో బోధ పడకం లేదు మాకీ! మా రేజీహాయినా పదీ రోజుల్కి ధవుడుతీశాడ్! హిప్పటి వర్కూ రాకాపోగా హుత్తరమ్ హాయినా రాయాలేద్! కాలం హెంతలుచ్చాగా మారింది హండీ! (నాలుక చప్పరిస్తాడు).

రాజి: నాన్న చనిపోయినకాడనుండీ తోడ బుట్టిన చెల్లెలుగా మీరు ఆదుకుంటున్నారు కాబట్టి సరిపోయింది కానీ లేకపోతే ఆయన యెక్కడుందీ తెలియని నా గతి యేమయ్యేదో!

ప్రభా: హెందుక్కుహావుతుందీహండీ! మీకీ హెందుక్కా కుషీగా హుండండి! హమరేంద్ర హెక్కాహున్నా మాకీ పిలిపిస్తాం!

రాజి: ఏం పిలిపిస్తారో యేమో! వ్రాసిన ఉత్తరాలన్నీ తిరి గొస్తున్నాయ్!

ప్రభా: హోర్కి హెక్కాహన్నా కాంప్‌లో హున్నారేమో.

రాజి: ఉంటే వివరాలు వ్రాయడానికే? వెళ్ళి నాలుగు మాసాలయింది! జాడా జవాబూ లేక పోతే నాగతి యేమవ్వాలనుకున్నారు! పెళ్ళయ్యేవరకూ పదినిముషాలయినా విడిచివుండని వ్యక్తి యిప్పుడీవిధంగా నెలల తరబడి కనబడక పోతే యేమిటి అర్థం!

ప్రభా: హానీ తెల్సీహుండాలీగావార్కి! మన్షి మంచీ వాడే! హేట్టా సుఖం! కట్టూకున్నా భార్యా కన్నీర్ పెడ్తుందీ హేమో హన్న యోచనా లేకపోయినాక హేట్టా సుఖం!

(నాలుక చప్పరించి) హాలోచించీ హేమ్టిౕ లాభం లేదు మన్కీ! (కోటుజేబులోనుంచి యేదో పొట్లం తీసిచ్చి) హిదీ నోట్కీ పసందుగా హుంటుందీ తీస్కో హమ్మా!

రాజి: నా గురించి మీరంతగా శ్రమపడడం యేం బాగుండలేదు! రోజూరోజూ మీరు పూలని, ఫలహారాలని పట్టుకొచ్చి యివ్వడంతో నా వ్యక్తికత విలువ తగ్గిపోవచ్చు!

ప్రభా: హాదేమ్టిౕ హమ్మా హట్లాహంటార్! మాకీ సిస్టర్ హుంటే పెట్కోమూ! తీస్కో సిస్టర్!

రాజి: (పొంగిపొర్లే ఆనందంతో) అన్నయ్యా! (ప్రభాకర్ తలసిమురుతాడు) మీ హృదయం ఎంత పవిత్రమయిందన్నయ్యా! మీవంటి అన్నగారు అందరికీ లభ్యపడతారా! లోకం దృష్టిలో ...

ప్రభా: హారే హేమ్టిౕ హమ్మా! లోకం, లోకం! హేమ్టిౕ లోకం? లోకాన్కీ కళ్ళూ హెక్కాహున్నాయ్? ఎదటా వార్కీ సుఖం చూడాలేనీ డఫార్ లోకం హేమ్టిౕ హనుకుంటే మన్కీ హెందుకూ? మాకీ అన్నా! మీకీ చెల్లెల్! బస్! (నవ్వుతూ) తీస్కో సిస్టర్! (అందిస్తాడు) రాజిత మౌనంగా తీసుకుంటుంది. బయటనుంచి జగం వచ్చి వాళ్ళిద్దర్నీ చూసి ప్రక్కకు తప్పుకుంటాడు) మీకీ దిగ్లూ పడకుండా కుషీగా హుండండీ! మాకీ మళ్ళీ హొస్తాం!

రాజి: అలాగే అన్నయ్యా!

ప్రభా: (ప్రేమతో చెంపమీద చిన్నగా తట్టి) పిచ్చిపిల్ల, (నవ్వుతూ బయటకి వెడతాడు. రాజిత పొట్లం తీసుకొని

లోపలకు వెళ్ళబోతుంది. జగం బయటనుంచి వచ్చి చిన్నగా నవ్వుతాడు)

రాజి: (ఆగి) ఏం వచ్చారు?

జగం: ఇప్పుడు రావడమే మీరిద్దరూ కేరింతలు కొట్టేముందే వచ్చాను!

రాజి: (నొసల్లు చిట్లించి) ఏమిటీ!

జగం: అదే! నేను మిమ్మల్ని డిస్ట్రబ్ చేయడమెందుకా అని కాస్సేపు అవతల వుండి డాక్టర్ వెళ్ళాక వచ్చాను!

రాజి: మీరంటున్నది ...

జగం: అందరూ అనుకుంటున్నదే! కాకపోతే పరోక్షంలో విన్న వింతకీ సమక్షంలో చూసిన ప్రత్యక్ష నిదర్శనానికి సరిపోయిం దంటున్నాను!

రాజి: (విస్తేక) జగంగారూ! ఏమిటి మీరంటున్నారు? నాలుక అదుపులో పెట్టుకు మాట్లాడండి!

జగం: అదే నేను చెప్పేదీను! భర్తవృాళ్ళో లేకుండా ఆడదానివి అయుంటే స్వేచ్ఛావిహారం చేయడం మంచిది కాదని అంటున్నాను! మీ నాన్నగారు ఆర్జించుకున్న పరపతికి నీవు ...

రాజి: చెడుగా ప్రవర్తించడం లేదు! డాక్టర్ నాకు అన్నతో సమానం! కాదు అన్నే!

జగం: అన్నావ్ బాగానే వుంది! నమ్మేదెవడు? నేను మీ కుటుంబానికి చిరపరిచితుణ్ణి, చుట్టాన్ని కనుక దాపరికం

లేకుండా చెప్తున్నాను! ఒక్కసారి అలా బజార్లోకి వెళ్ళి వింటే సర్వం నీకే బోధపడుతుంది! యితరులకు అనుమానం కలగకుండా అన్నా చెల్లెలని బొంకుతూ మీరు ఆడుతున్న భాగవతం అందరికీ తెల్సిపోయింది!

రాజి: (విస్తుపోక పెద్దగా) జగంగారూ!

జగం: నా నోరు మూయించాలని ఆవేశపడతావే కానీ, నీకూ సాహెబుకీ యే సంబంధమూ లేకపోతే ఎంత అన్నగా భావిస్తేమాత్రం పూలు, తినుబండారాలూ దినం తప్పకుండా తీసుకొచ్చి యివ్వచ్చా? అందులో భర్త వూళ్లో లేకుండా పూలు యివ్వడమేమిటి? ఆ పూలు నీవు తల్లో పెట్టుకోవడ మేమిటి? నేను నాల్గు రోజులు ఊళ్లో లేకపోతే మా ఆవిడ పువ్వు మొఖం చూడకపోగా నూనె రాచి తలయినా దువ్వుకోదే! (చిన్నగా నవ్వి) యితరత్రా ఆశలు లేనివాళ్లూ అలాగే ఆదర్శంగా బ్రతికి పతివ్రతలు అనిపించుకుంటారు. మొగుడు జాడ తెలియక పోయినా డాక్టర్ అన్నివిధాలా ఆదుకోడానికి వున్నాడు కాబట్టి అవసరానికి తప్పటడుగు వేస్తే వేశావు! వీధికెక్కకుండా కాస్త గోప్యంగానా వుండేట్లుచూడండి!

రాజి: మీ మాటలతో నాతల పగిలి పోతున్నది! శూలాలు కంటే పదునుగా మీ మాటలు నాగుండెల్ని చీల్చి వేస్తున్నాయ్! ఏపాపం యెరుగని ఒక అమాయకురాలి నెత్తికి అపవాదు చుట్టి అల్లరి చేయడమేనా మీపని? మీకు హృదయం లేదూ? జాలిలేదూ? నాలాంటి కూతురు మీకూ వుంటే!

జగం: మా అమ్మాయి నీలాగా తెలివితక్కువపని యెప్పుడూ చేయదు! చేసిందా చీల్చి ఎండేస్తాను! ఆ! నీలాగా లోకం అంతా తారుమరయిందని ఊహించదు! మా అమ్మాయిగుణం ఎక్కడ! పది మంది పురుషులకీ విలాస వస్తువులా వినియోగించ బడుతున్న నీగుణం ఎక్కడ?

రాజి: మళ్లీపరుషవాక్యం మీనోటివెంట వినబడిందా సహించడం అనేది వుండదు! పరాయికొంపలుతీపి ఎందరినెత్తినో చేతులు పెట్టే నీదీ ఒక బ్రతుకే! నువ్వూ వకమనిషివే!

జగం: తానెంతో జగమంత అనుకునే వాళ్లకి వేరే చెప్పే దేముంది? ఎరిగున్న మేళం కనుక యిప్పటికైనా జాగ్రత్త పడి పరువు కాపాడుకోమంటున్నాను! వింటావా బాగు పడతావ్! లేదా యేమయితే నాకేం! నేను వెళ్లొస్తా!

రాజి: వెళ్ళండి! మళ్ళీ ఎప్పటికీ తిరిగి రాకండి! నిజానిజాలు తెలియక నోటికి వచ్చినట్లు మాట్లాడే మీలాంటి వారు రాకుండా వుంటేనే మంచిది.

జగం: అవున్లే! అందరూ అనుకుంటున్న వార్త అమరేంద్ర వరకూ వెళ్లేవుంటుంది! అందుకే అయిదో రోజుకి వస్తానని వెళ్లినవ్యక్తి అయిదు మాసాలయినా అంతులేడు! యింకా వాడే మొస్తాళ్లే! (నాలుక చప్పరించి) కందకు లేని దురద కత్తిపీటకా కాని నీకులేని చింత నా కెందుకు? నీయిష్టంనీది! (లేచి) వస్తా! (వెళ్ళబోయి ఆగి) వెడుతూ ఒక్క సలహా మాత్రం యిస్తున్నాను! ప్రభాకర్‌ని ప్రేమించావ్! అమరేంద్రను ఆదర్శంగా పెళ్ళాడావ్! బిస్మిల్లాఖాన్‌తో

కులుకుతున్నావని అపవాదుకానీ నిజంకానీ వార్తలు ప్రతి నోటా వినిపిస్తున్నాయ్! అంచేత అదే నిజమయితే అయిపోయిందేదో అయిపోయింది! ఆ బిస్మల్లాఖాన్‌ని పెళ్ళాడి కొంత అల్లరి తగ్గించుకో! యింతకంటే మంచి సలహా యిచ్చేవారు నాకంటేమరొకరు లేరు! తర్వాత నీయిష్టం! (నెమ్మదిగా బయటకి వెడుతుంటాడు).

రాజి: జగంగారూ!

జగం: (ఆగుతాడు) ఎందుకు?

రాజి: అందరిలాగా మీరూ నన్ను అనుమానించి పదిమందికీ చెప్పబోకండి! యీసారివస్తే బిస్మిల్లాఖాన్‌ని రావద్దని గట్టిగా చెప్తాను! మీరు ...

జగం: తల్చుకుంటే మీ నెత్తినున్న అపవాదులే తుడిచివేయగలను. కానీ ఎందుకు చేయాలి? మీ నాన్నగార్ని నమ్మి గూడెం ప్రజలదగ్గర వేలు పోగుచేసి యిస్తే అణాయివ్వకుండా మొత్తం స్వాహాచేశాడు. తోడబుట్టిన అన్న ఆస్తిని రహస్యంగా ఆయనపేర వ్రాస్తే రికార్డు దాచుకోడం చేతగాక అ శివయ్యగాడిని యింట్లోపెట్టుకొని రికార్డు వాడికి అర్పితం చేశాడూ? ఆ వెధవ, నిన్న మొన్న మైనార్టీ పోయిన బోడివెధవ నా మీద దావా వేస్తాడా! ఇది యిలా వుండగా అడ్డంవుండి అనేక విషయాల్లో మీ నాన్నగార్కి సహకరించి ఆస్తి కూడబెట్టుకోడానికి అప్పులు యిస్తే ఎక్కడి అప్పులు అక్కడ వుంచి, అందరికీ పంగనామాలు పెట్టి తను కాస్తా గుటుక్కుమన్నాడు! అప్పులువాళ్ళు ఎనుకు తిరిగినా, శివయ్య పెట్టిన సివిలు, క్రిమినల్ కేసులు

గెల్చినా నాపని యేమవ్వాలి? నా పెళ్ళాం పిల్లల గతేమిటి? నన్నింత యిరుకున పడేసి చచ్చిపోయాడే మీ నాన్న? మీరంటే నాకెందుకు కనికరం వుండాలి? మీ పరువు నేనెందుకు కాపాడాలి?

రాజి : అందుకు నన్నేంచేయమన్నా చేస్తాను! నా గురించిన దుష్ప్రచారం మాసిపోయేట్టు చేయండి! మీ కూతురే యీస్థితిలో మిమ్మల్ని కోరుతున్నదన్న భావంతో కనికరించండి!

జగం : అయితే నామాట వింటావా!

రాజి : వింటాను!

జగం : నేనొక కాగితం తీసుకొచ్చాను! దానిమీద సంతకం చెయ్!

రాజి : చేస్తాను!

జగం : ఆ కాగితంలో యేముంటుందో తెలుసా? భీమశంకరం గారి ఆస్తికి వారసురాలయిన నువ్వు యావదాస్తీ స్వబుద్ధితో, దానా దమన విక్రయాది సర్వహక్కులతో నాకు చెందేట్లుంటుంది! అంగీకరిస్తావా?

రాజి : అంత అన్యాయమా!

జగం : న్యాయాన్యాయాలు గుణించే సమయంకాదు యిది! పరువుమర్యాదలు కాపాడుకోవలసిన ఘడియలు! కాకపోతే నీ భర్త తిరిగి వచ్చేవరకూ నెలకు పదో పదిహేనో బాడుగ యిచ్చి యీ యింట్లోనే ఒక గదిలో వుండవుగాని! ఆ

అవకాశమయినా ఆడదానివి, వంటరి దానివీ అని కలుగ చేస్తున్నాను! ఏమంటావ్! అంగీకరిస్తావా!

రాజి: అంగీకరిస్తాను!

జగం: (దిక్కులు చూస్తూ) అయితే యింద! (జేబులోనుంచి కాగితాలు తీసిచ్చి కలం యిస్తూ) చెయ్ సంతకం! (రాజిత కంటతడి తుడ్చుకొని సంతకం చేస్తుంది) పిచ్చిదానా! ఆడ పిల్ల ఉసూరు మనకూడదు. నీకే భయం లేదింక! నువ్వు నిశ్చింతగా వుండు! ఒక్క డాక్టరే కాదు ఎందరు నీతో మాట్లాడినా, ఎందరితో కలసి నీవు తిరిగినా నీ మీద యే వొకళ్ళకీ ఏలాంటి అనుమానం రాకుండా నేను కాపాడు తాను. (చిన్నగా నవ్వి కాగితాలు జేబులో పెట్టుకొని) కనీసం యీ నెలాఖరులోగాన్నా యిల్లు ఖాళీచేసి నా స్వాధీనం చెయ్! (నవ్వి) కళ్ళుచూడు ఎంత ఎర్రపడ్డాయో! ఏదో మాటామాటా వచ్చినప్పుడు అనేకం అనుకుంటాం! అవన్నీ మర్చిపోవాలి! కళ్ళ నీళ్ళుతుడుచుకుని కమ్మగా భోజనం చెయ్! నాకు అవతల పనుంది నే వెళ్లొస్తాను! (బయటికి వెడతాడు.)

రాజి: (తెల్లబోయి చూస్తూ కంటతడి పెడుతుంది – బయట నుంచి ప్రభాకర్ వస్తాడు. రాజిత మొహం తిప్పేసుకుంటుంది)

ప్రభా: హారె! సిస్టర్! హేప్పీ హట్టాహుండార్ మీకీ!

రాజి: మీరు మా యింటికి రావడం మానుకుంటారా!

ప్రభా: హిడ్డా హేప్పీ హొచ్చింది?

రాజి : ఏ మెచ్చినా మీరు నా మొహం చూడకూడదు! నాతో మాట్లాడకూడదు! వెళ్ళండి! ముందిక్కణ్ణుంచి వెళ్ళండి!

ప్రభా : మాకీ హేమ్టీ చేశామ్?

రాజి : మీరేంచేయలేదు! నాకాళ్ళకింద నేనే గోతులు తీసుకున్నాను! మీకూమాకూ యేంసంబంధంవుందని మా యింటికి రావాలి? నాకు పూలూ తినుబండారాలూ మీరెందుకు యివ్వాలి!

ప్రభా : హన్న చెల్లెల్కి హెందూ హిస్త్రాడ్?

రాజి : మీరు నా తోడబుట్టిన అన్న కాదుగా! కనీసం మనిద్దరి మధ్యనా బంధుత్వమన్నా లేదుగా! యింట్లో మనిషిలా తిరుగుతూ కావలసిన సదుపాయాలు సమకూరుస్తూంటే వినేవాళ్ళు యేమనుకుంటున్నారో మీకు తెలుసా?

ప్రభా : హెవరనుకుంటున్నార్? హేమ్టీ హనుకుంటుండార్?

రాజి : ఏదయినా సాక్ష్యాలు అనవసరం! నామీద దయ, అభిమానంవుంటే నా ముఖం చూడకండి! మళ్ళీ చెప్తున్నాను! నన్ను మర్చి పొండి!

ప్రభా : మీకీ మర్చి పోన్దమా! మీకీ మర్చిపోన్దమా మాకీ!

రాజి : మీరుమంచివారు కావచ్చు! మీది తేట మనస్సు కావచ్చు! కానీ మన వెనక సంఘం, కులం అంటూ వున్నాయ్! మీరెంత నిష్కల్మష హృదయం గలవారైనా మనమెంత పవిత్ర ఆదర్శాలు కలవాళ్ళమైనా లోకులు

కాకులుగా మనచుట్టూవుండి మన్ని అపహాస్యం చేస్తున్నారు. అమరేంద్ర రానందుకే కుళ్ళికుళ్ళి యేడుస్తుంటే పుండు మీద కారంచల్లినట్లు మీవలన మరీ ఘోష ఎక్కువ యింది! ఆఖరిసారిగా చెప్తున్నాను! మీరు మరువక పోయినా నన్ను విడువకపోయినా యీ రాజిత ప్రాణాలతో వుండదని తలచండి!

ప్రభా: (విన్లేక గట్టిగా) రాజీ! (గొంతు తగ్గించి) నీ మొండి తనం నువ్వు విడిచిపెట్టవ్! ఎంతమాటంటే అంత!

రాజి: విస్తుబోయి) ఆఁ! (నెమ్మదిగా) రాజి! మాటలో మార్పు! గొంతు...... గొంతు...... గొంతు...... (సమీపిస్తుంది)

ప్రభా: (తనతొందరపాటుని సవరించుకుంటూ) హెందుక్కలే! నాదీ మూలంగా మీకీ హెందుక్క మరణించాలా! మాకీ హెళ్ళిపోతామ్! (వస్తున్న విచారం అణచుకుంటూ) మళ్ళీ జన్మలో మీకీ ఎదుట పడం! హాస్తా! (రాజిత జవాబు కోసం ఎదురు చూడకుండా వెళ్లబోతాడు)

రాజి: ఆగండి! (ప్రభాకర్ ఆగుతాడు) ఎవరు మీరు?

ప్రభా: హెంతలోనే మర్చిపోయార్. మీకీ!

రాజి: మర్చి పోవడం కాదు! మనోవేదనతో క్రుంగిపోతున్నాను! అదేమాట, అదే విసుగు, మీరు నా ప్రభాకర్ అవునా కాదా? (ప్రభాకర్ మొహం తిప్పేసుకుంటాడు) నిజం చెప్పండి! మీరు నా ప్రభాకర్ అవునా కాదా! (ఎదురు గా వెళ్ళి పరిశీలనగా చూస్తుంది).

ప్రభా : నాదీ మనస్సు గప్ చిప్‌గాహుంది! హిప్పూ మాకీ యేప్పిా చెప్పాలేం! హూస్తా! (వేగంగా బయటికి వెళ్ళ బోవును. బయటనుంచి అమరేంద్రవేగంగా వస్తాడు (ప్రభా కర్ ఆగి) ఆ! హమరేంద్ర!

రాజి : మీారా! వచ్చారా! మీాకోసం ఎంత తపించి పోతున్నానో మీాకు తెలియదా!

అమ : తెల్సును! అందుకేగావచ్చాను! (బెదురుగా వెనక్కి చూస్తాడు) నేను రాకపోయినా తన చెల్లెల్ని కాపాడు కోడానికి సోదరసమానుడు డాక్టర్ ఉండగా నీకేంకొదవ! (నవ్వి) కులాసాగా వున్నారా డాక్టర్?

ప్రభా : మీాకీ దయావల్నా కుషీగానే హున్నాం మాకీ!

రాజి : లోపలికి రండి!

అమ : వస్తాను! ఆ గోవిందుగాడు బెడ్డింగు తీసుకొని వెళ్లాడు. ఎటుపోయిందీ తెలియదు! వాణ్ణి పోలీసులు అన్యాయంగా పట్టుకున్నారని తెల్సింది! (బెదురుగా ఒకసారి వెనక్కిచూసి) అదేదో వెళ్ళి చూసి రావాలి! (పాంట్ జేబులోనుంచి గొలుసు తీసి అందిస్తూ) యీా చైన్ నీకోసం కొన్నాను! మెళ్ళో పెట్టుకో! నేను పది నిముషాల్లో తిరిగి వస్తాను. (వెళ్ళబోయి ఆగి) బావగారూ! చెల్లెలుతో మాట్లాడు తూండండి వస్తాను! (గబగబా బయటికి పరుగెత్తుతాడు. రాజితకు పరిస్థితి బోధపడక క్షణం ఆలోచించి చేతిలోని గొలుసుని పరీక్షగా చూస్తుంటుంది.)

ప్రభా: హెందో్క హంతకంగార్! నిరపరాధుల్ని పట్కుంటే హేహ్టిూ హవుతార్! యిప్డు కాకాపోయినా కాశేపటికైనా తిర్గి రాకపోతార్! (రాజితను అదోలా చూసి బయటికి వెళ్ళబోతాడు)

రాజి: ఒక్కమాట! (ప్రభాకర్ ఆగుతాడు) మీకు నా మీద పవిత్ర అభిమానం వుందికాదూ?

ప్రభా: హదీ చెరగని సత్యం!

రాజి: అయితే నా మొహం చూసి ప్రమాణం చేసి చెప్పండి! మీరు ప్రభాకర్ కాదూ!

ప్రభా: హిప్డూ హది హంతా హెంమ్క!

రాజి: అదేం కాదు. మీరు చెప్పితీరాలి! నేను బ్రతకాలంటే చెప్పాలి! మీరే నా ప్రభాకర్ అయితే మాట నిలబెట్టుకోడంలో నే నెంత మొండిదాన్నో మీకు తెల్సు! చెప్పండి! మీరు నా ప్రభాకర్ అవునా కాదా చెప్పండి!

ప్రభా: అవును! నేను నీ ప్రభాకర్‌నే!

రాజి: ఆ! (వణికిపోతూ) నా ప్రభాకర్, నన్ను ప్రేమించిన పవిత్ర ప్రణయమూర్తి ప్రభాకర్ మీరా! (తెల్లబోయి పరీక్షగాచూస్తుంది.)

ప్రభా: అవును. నీవంటి భాగ్యశాలిని పొందలేక అవిటివాడై అలమటిస్తూ, కనీసం నీ క్షేమాన్నయినా చూసి ఆనందించాలని అభిలషించిన ప్రభాకర్‌ని నేను. (గడ్డం మీసం తీశేస్తాడు. రాజిత క్షణం అలాగే చూసి కుప్పలా క్రిందపడు

తుంది. ప్రభాకర్ కంగారుగా కాసీని నీళ్ళు తెచ్చి మొహాన చల్లి) రాజితా! (కూర్చోబెడతాడు.)

రాజి: (కళ్ళు తెరిచి చూస్తూ) మీరు బ్రతికే వున్నారా? బ్రతికి వుండీ నాకీ శిక్ష ప్రసాదించారా? నే నేం పాపం చేశాను? ఎందుకింత శిక్ష విధించారు?

ప్రభా: శిక్ష విధించింది నేను కాదు! మనిద్దరం చేసుకున్న బాసలు ప్రకారం అన్యోన్యంగా వుంటే ఆదర్శప్రాయమైన జీవితాన్ని సాగించడం యిష్టంలేని ఆ భగవంతుడే మనకీ శిక్షలు ప్రసాదించాడు. కన్నతండ్రి నిన్ను పెళ్ళాడటానికి అంగీకరించలేదు! ఆయన్ని వ్యతిరేకించి తిరిగివస్తున్న సందర్భంలో బ్రిడ్జి విరగడం, రైలు పడిపోవడం జరిగింది. మరణించిన వాళ్ళతో బాటు నేనూ మరణించినా బాగుండేది! మరణించక పోగా నన్నీరీతిగా కుంటివాణ్ణి చేశాడు భగవంతుడు! అవిటివాడినై యుండీ ఆదర్శజీవితాన్ని ఎలా సాగించగలను! అవిటివాణ్ణి నిన్ను ఎలా సుఖపెట్టగలను! అవిటివాణ్ణి పెళ్ళాడి నువ్వెందుకు నవ్వులపాలు కావాలి! బ్రతికున్నంతకాలం నిన్ను యేడ్పించడానికి మనస్సు అంగీకరించలేదు. నా మొహం నీకు చూప కూడదనుకున్నాను! ఎంతో ఆశతో నా రాకకోసం వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తుంటావని, నా రాకకోసం పరితపిస్తావని అనుకున్నాను. నీ జీవితం అంధకారం చేయడానికి మనస్సు వప్పలేదు. వెన్నెలవెలుగులా నువ్వు కళ్యాణం చేసుకొని కళకళ్లాడుతూండడమే నేను కోరేది. నన్ను మర్చిపోతావని నేను రైలు యాక్సిడెంటులో నేను మరణించినట్లు నేనే టెలిగ్రాం యిచ్చాను!

రాజి: మీరే టెలిగ్రాం యిచ్చారా!

ప్రభా: అవును! ఇచ్చాను! కానీ నా పంచప్రాణాలూ నీమీదనే వున్నాయ్! నిన్ను చూస్తూ కనీసం నీ చేరువలోనన్నా జీవితాన్ని గడపాలని ఆశించాను! గత చరిత్రను మర్చిపోతూ సోదరి సమానంగా చూసుకుంటూ యీ మారు వేషంలో యిక్కడ పడున్నాను.

రాజి: మారు వేషంతో మోసం చేయడం న్యాయమేనా!

ప్రభా: న్యాయం అంటూ కూర్చుంటే కోరిక ఎలా తీరుతుంది! నీ తేట మనసులో తుఫాన్ లేవదీయడం యిష్టం లేకపోయింది! దానికితోడు నువ్వు ప్రభాకర్‌ని మర్చిపోవడమే కోరినవాణ్ణి కావడం చేత యీ వేషం వేశాను! వేషంతో మోసం చేసినందుకు మన్నించు చెల్లీ!

రాజి: అన్నయ్యా! (దగ్గరకు తీసుకుంటాడు) బయటనుంచి ఒక ఆసామి పోలీసు యిన్సపెక్టర్ని మరో యిద్దరు పోలీసుల్ని వెంటపెట్టుకు బయటనుంచి వస్తాడు. (రాజిత ప్రభాకర్‌లు విస్తుబోయి చూస్తారు.)

ఆసామి: (రాజిత చేతిలో గొలుసు చూపి) ఇదిగో సార్ గొలుసు!

ఇన: ఈ గొలుసు మీ కెలావచ్చింది?

ప్రభా: కొంటే!

ఆసామి: అలాగా! రామకోటి ఉత్సవాల సందర్భంలో నా భార్య మెళ్ళోనుంచి తెంపబడింది యీ గొలుసు! కావాలంటే పేరుచూడండి! యస్. వి. అని వుంటుంది! ఆ!

రాజి: ఆఁ! (గొలుసు చూస్తుంది)

ప్రభా: (గొలుసు అందుకొని చూస్తాడు)

ఇన: ముందా గొలుసు యిలా యివ్వండి! (తీసుకొని చూసి) ఏయ్! ట్రెబుల్ వన్! ఆమెను స్టేషన్‌కి తీసుకుపదండి!
(రాజిత కొయ్యబారి నిలబడి ఉంటుంది)

ప్రభా: ఎందుకు?

ఇన: అరెస్టు చేసినందున!

ప్రభా: ఆమె నిరపరాధి.

ఇన: దొంగసొమ్ము ఆమెచేతిలో చిక్కింది!

ఆసామి: చిక్కినా మెళ్లో గొలుసు తెంపింది పురుషుడే!

ప్రభా: మీరు చూశారు కాబట్టి నిజం చెప్పారు!

ఆసామి: చెప్పడం యేమిటి?. నేనూ పోలీసులూ వెంబడిస్తే! ఆ పురుషుడు యీ యింట్లోనే దూరాడు! ఆ!

ప్రభా: నేనేగా ఆ పురుషుణ్ణి.

రాజి: అన్నయ్యా!

ప్రభా: చేసిన తప్పువప్పుకోక ఒక నిరపరాధిని అవమానపర్చే కంటే నేరాన్ని వప్పుకొని శిక్ష అనుభవించడం మంచి దమ్మా!

ఆసామి: గొలుసు తెంపినతనిది కుంటికాలు కాదే!

పోలీ: అవును: గట్టిగా పరిగెత్తాడుకూడా!

ప్రభా: అవచ్చు! అతను నా చెలికాడు! యిద్దరం కలిసే చేస్తూంటాం నేరాలు!

ఇన: అయితే మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాం!

ప్రభా: అంతరంగికంలో ఆశయం నెరవేరడానికి ఆనందంగ అనుభవిస్తాను! (పోలీసులు సంకెళ్ళు తగిలిస్తారు)

రాజి: (పొంగిపొర్లే దుఃఖంతో) ప్రభాకర్!

ప్రభా: అన్నిటికీ భగవంతుడున్నాడు! బావగారు కాశ్మీపట్లో వస్తారు! జాగ్రత్తగా వుండమ్మా ... వస్తా!

ఇన: ఊ! తీసుకుపొండి! (పోలీసులు ప్రభాకర్‌ని నెట్టుకు పోతారు. తెరలో పాట వినిపిస్తుంది. రాజిత ప్రభాకర్ వెళ్ళినవేపే కొయ్యబారి చూస్తూంటుంది)

—: పా ట :—

తెరలో: (సాకి) ఏమిన్యాయమో యిది! యేమిధర్మమోయిదీ!
నిరపరాధులకు శిక్షా! కఠిన పరీక్షా ... ...

(చరణం) ఇదే న్యాయమా - ఇదే ధర్మమా
లోకంతీరు మారదా - యీ లోకం తీరుమారదా?
॥ ఇదే ॥

మంచివారికే వంచన?
లోకానికేల యీ అంచన?
నేరం చేసేదొకరా! భారంమోసే దొకరా!
యుగయుగాలకు చెరగని సత్యమా! ॥ఇదే॥

రాజిత తలతిరిగి పడిపోతుంది.

(తెర)



# తేటమనసులు

## 4 వ రంగము

[ రాజితకు ఆశ్రయమిచ్చిన శ్యామసుందరంగారి యింట్లో ఒక గది ! ఎదురు గోడకు రెండు కేలండర్లు మాత్రం తగిలించి వుంటాయ్. గదిలో ఒక ప్రక్కన పొడుగాటి బల్ల వుంటుంది. రాజిత బల్లమీద కూర్చుని యేదో ఆలోచిస్తుండగా తెర ప్రక్కకి తొలగుతుంది. మరో క్షణం తర్వాత శ్యామ సుందరం వస్తాడు. గదిలో చీకటి ఆవరించివుంటుంది. రాజిత నీడగా కనిపిస్తుంది. ]

శ్యామ : రాజితా !

రాజి : (లేచి) బాబూ !

శ్యామ : ఎనిమిది గంటలయినా లైట్ వేసుకోలేదేమమ్మా !

రాజి : హృదయం బండబారి చుట్టూ చీకటి ఆవరించినప్పుడు లైటు వేసినంతమాత్రాన వెలుగు వస్తుందా బాబుగారూ ?

శ్యామ : ఎందుకు అంతయిదిగా మనస్సు నొచ్చుకుంటావ్ ! నీ అమరేంద్ర కోసం దేశం అంతా గాలిస్తున్నాం ! ప్రత్యేకించి మనుషుల్ని పంపాను ! (లైటు వేస్తాడు)

రాజి : అనాథలకు ఆశ్రయమిచ్చి ఆదుకోడానికి మీవంటి సహృదయులుగల దాత దొరకడం నా అదృష్టంగా భావిస్తున్నాను!

శ్యామ : దాని కేముందిలేమ్మాయ్! నా అన్నా వాళ్లెవరూ లేరన్నావుకదాని ఆదుకున్నాను! యింతలో నాకు పోయే భాగ్యమేముంది? (చిన్నగానవ్వి) అన్నట్లు మర్చిపోయాను! ముందు గదిలో గోడకున్న ఫొటో సంగతి కాదూ నువ్వు అడిగింది! వాడు మా అబ్బాయి! పేరు ప్రభాకర్! ఒకటిన్నర సంవత్సరాల క్రితం ఎవర్నో ప్రేమించానని పెళ్లాడతానని వచ్చి అడిగేడు. తీరా ఎంక్వయిరీ చేస్తే ఆ పిల్ల ముత్తవతల్లి చెడి బ్రతికిందని తెలిసింది! గౌరవ మర్యాదలు కల కుటుంబంలో పుట్టి కులట సాంప్రదాయంలో పుట్టి పెరిగిన పిల్లను పెళ్ళాడడానికి ఎలా అంగీకరిస్తాను? వప్పుకోలేదు! పెళ్ళంటూ చేసుకుంటే ఆపిల్లనే చేసుకుంటానని ఎదిరించి అప్పటికప్పుడే వెళ్ళిపోయాడు! మళ్ళీ యీనాటి వరకూ వాడి ఆచూకీకూడా తెలియలేదు! యం. బి. బి. యస్. చదివి చేతికి అక్కరకు వచ్చిన పుత్రుడు నాకు కాకుండా పోయాడు! యేమయ్యాడో యేమో! రోజూ ఆఫొటోని చూసుకొని తృప్తిపడు తున్నాను! (రాజిత కంట తడి పెడుతుంది.) నువ్వెందు కమ్మాయి కంట తడి పెట్టావ్! అవును! అక్కరకు వచ్చిన సుతుడు కరువై కుళ్ళి కుళ్ళి యేడ్చే తండ్రిని చూస్తే యెవరయినా జాలి పడతారు.

రాజి : బాబుగారూ! ఎందుకు బాధపడతారు!

శ్యామ: బాధకాక యేముంది? నే నీ లోకంలో యేకాకిని! తానొకటి తలిస్తే దైవమొకటి తల్చిందని నా ఆశలు కూలిపోయి జీవచ్ఛవంగా బ్రతికివున్నాను. అనుభవించడానికి ఆస్తి వుండీ సుఖపడడానికి అవకాశముండీ, అలమటించడం ఆదర్శమైంది! కట్టుకున్న భార్య కాలగర్భంలో కలిసిపోయింది. లేక లేక పుట్టిన పుత్రుడు శత్రువై వెళ్ళిపోయాడు.

రాజి: కష్టాలు వోర్చుకున్నవాడే ఘనుడంటారు బాబుగారూ! పెద్దలు మీకు తెలియన్దేముంది! ఎవరికైనా మంచిరోజులు యెప్పుడోప్పుడు వస్తాయని మా నాన్నగారు అప్పుడప్పుడు అంటుండేవారు!

శ్యామ: నాన్నగారంటే గుర్తుకొచ్చింది! నువ్వు పెళ్ళాడిన అమరేంద్ర అసలుపేరు నరేంద్రట! అతనొక పెద్ద జేబు దొంగట! అతని కొక ముఠావుదింట! ఈ ముఠాముత్తం రైళ్ళల్లో కొల్లగొట్టడం, ప్రయాణీకుల్ని అదిరించి బెదిరించి వాళ్ళవస్తువులు అపహరించడం నిత్యకృత్యంట! జేబులు కత్తిరించడంలో అమరేంద్రగా నమ్మించిన నరేంద్రుడు శిద్ధహస్తుడుట!

రాజిత: ఇదంతా మీ కెవరు చెప్పారు బాబుగారూ!

శ్యామ: ఎవరు చెప్పడమేమిటమ్మా! నువ్వు చెప్పిన గుర్తుల్ని చెప్పి అడిగితే పోలీసు డిపార్టుమెంటువారు చెప్పారు. అతనిదీ యీవూరేట ఒకప్పుడు! పోతే శివయ్య అన్నావే అతగాడు మీ ఆస్తికాజేసిన జగం మీద దావావేసి గెల్చాడట! జగం అనే అతనికి మోసాలుచేసినందుకు, ఫోర్జరీలు బనా

యించినందుకు ఆరు సంవత్సరాలు కఠిన శిక్ష విధించారట! ఆశివయ్యే అడ్రసు తీసుకొని ఉత్తరం వ్రాశాను బయల్దేరి రమ్మని!

రాజి: అలాగా బాబుగారూ!

శ్యామ: అంతే కాదమ్మా! మహమ్మదీయుడు అయివుండి మంచి భావాలతో నిన్ను సోదరసమానంగా చూసిన బిస్మిల్లాఖాన్‌కి విధించిన సంవత్సరం శిక్ష నిన్నటితోనే సరిట! యివ్వాళో రేపో విడుదలవుతాడట! అతన్నికూడా సాధ్యమైనంత త్వరలో యిక్కడికి పిలిపిస్తాను!

రాజి: (వస్తున్న విచారం అణుచుకుంటూ) ఎందుకు లెండి బాబుగారూ! యిక్కడికి ఎవర్నీ పిలిపించద్దు! అందువలన అనేకం అనుకోని కష్టాలు నష్టాలు వస్తాయ్! యిక్కడున్నా నన్ను మనశ్శాంతితో బ్రతకనీయండి!

శ్యామ: అలాగా!... పోనీ అలాగే చేస్తాను! నీకు వాళ్ళను చూడాలన్న తలంపు లేకపోతే పిలిపించను. నాలాగే నీకు దిక్కూ మొక్కూ లేదు. వయస్సులో వున్న వంటరిదానివని జాలి పడి చేరదీశాను! నిన్ను చూస్తూంటే అణిగిపోయిన ఆనందం తలెత్తింది! ఊహకందని ఆశలు చిగురించినాయ్! యేమో తెలియని కొత్తశక్తులు తలెత్తినాయ్! యీనా ఆస్తి యిక మీద నాతోబాటు నువ్వూ స్వేచ్ఛగా అనుభవించవచ్చు! నువ్వు 'ఉ' అంటే మొత్తం ఆస్తి నీపేర పడేస్తాను!

రాజి: మీ ఉద్దేశం బోధపడడంలేదు!

శ్యామ: ఆడదానివి అనుభవం తక్కువ అయినదానివి! (నవ్వి) మనిద్దరం ...

రాజి : (పెద్దగా) శ్యామసుందరంగారూ !

శ్యామ : తప్పించుకు తిరుగుతున్న దొంగ ఎప్పటికీ నీకు దక్కడు!
ఒకరితో కాపురం చేసిన కాంతవన్న అనుమానం నాకులేదు!
అదీగాక కళంకం వున్నా కడుపున పిల్లాజల్లా పుట్టలేదు!
నువ్వు 'సరే' నంటే మనిద్దరం పెళ్లి చేసుకుందాం!

రాజి : (పెద్దగా విన్లేక) శ్యామసుందరంగారూ !

శ్యామ : పోనీ, బహిరంగంగా పెళ్లాడడం యిష్టంలేకపోతే ఒక్కసారి ... (భుజంమీద చేయి వేస్తాడు.)

రాజి : (తప్పించుకుని) ఛీ ! మీరేమో పెద్దమనుషులు అనుకున్నాను! మీ తీయని మాటలకు తలవంచుతాననితల్చకండి! ఆపదలో వున్న నాకు ఆశ్రయమిచ్చిన దాత అనుకున్నాను కానీ, మీలో యింత నీచబుద్ధి వుందనుకో లేదు. మీ ఆస్తీ, మీరు తృణప్రాయం! వంటరిగా చిక్కిన ఆడదాని మీద మీకు కలిగిన తుంటరిబుద్ధికి సహించ వీలులేక పోయినా తండ్రిలాంటి వారు కనుక యేమీ అన్లేక పోతున్నాను! దయవుంచి ...

శ్యామ : చేరనిచ్చింది అణగారిపోయిన కోరిక తీర్చుకోడానికే!

రాజి : అయితే యీలాంటి పాడు కొంపలో నేనుండను! నన్ను వెళ్లనియ్యండి!

శ్యామ : వెళ్ళనిచ్చే పద్ధతి అయితే నెలరోజులుగా నిన్నెందుకు యింట్లో పెట్టుకుపోషిస్తాను ? (నవ్వి) నీ యవ్వనం ప్రతి క్షణం నన్ను కవ్వించ ప్రారభించింది! ఒక వేళ నీవు తప్పించుకు బయటపడ్డా నేను లేవదీసుకొచ్చిన దానివని,

నన్ను దగాచేసి పారిపోయిన దానివని ఎలాగూ అభాండం వేస్తారు! అపవాదులు ఎలాగూ తప్పనప్పుడు కొద్దిక్షణాలు కళ్ళుమూస్తే కలిగే నష్టంలేదుగా! అంతగా నీకిష్టంలేకపోతే ఒక్క సారి స్వాదానిపై నాకు అమరసుఖం అందించు! పారితోషికంగా పదివేల రూపాయలు యిస్తాను! ఉండ టానికి పంచ, తింటానికి తిండి యేర్పడుతాయ్! రహ స్యమూ మనిద్దరికీ తప్ప ఎవరికీ తెలియదు! ఏమంటావ్?

రాజి: అతిప్రస్తావన మానమంటాను! ఒక్క నిముషమైనా నేనిక్కడ వుండదల్చుకోలేదు! యిప్పటివరకూ మీరు చూపిన ఆదరణకు నాధన్యవాదాలు! శెలవు! (అతని జవాబుకి ఎదురుచూడకుండా బయటికి వెళ్ళబోతుంది. శ్యామసుందరం చెయిపట్టుకు వెనక్కి విసురుగాలాగుతాడు.) నన్ను ముట్టుకోడానికి మీకేమిటి హక్కు? ఆడదానికి ఆవేశం వస్తే అగ్నిపర్వతాలు పగిలినంత పనవుతుందని తెల్సుకొని నాకు దారివ్వండి! దారికి అడ్డులేవండి ముందు!

శ్యామ: (చిన్నగా నవ్వుతూ) వృథా ప్రయాస! నిన్ను అనుభ వించి తీరుతాను! (నవ్వుతూ సమీపించి క్రూరంగా మొహంలో మొహం పెట్టిచూస్తూ) ఏ మంటావ్ చెప్పు! పది క్షణాలు కళ్లు మూస్తావా లేదా? (ఎదురుగా వున్న కిటికీ అవతల ఎవరో పరుగెత్తినట్లు నీడ కనబడుతుంది. ఆ నీడను రాజితగానీ, శ్యామసుందరంగానీ చూడరు) పది వేల నగదు తిరస్కరించడం అవివేకం! నిన్ను చూస్తున్న కొద్దీ ఉద్రేకం పెరిగిపోతున్నది! నిన్ను (తెల్లబోయి అలాగే కంగారుగా కళ్లప్పగించి చూస్తున్న రాజితను కదలకుండా

గట్టిగా పట్టుకొని ముద్దుపెట్టుకోబోతాడు. రాజిత కెవ్వున అరుస్తుంది! కళ్ళకు గంతలుకట్టుకుని పోల్చడానికి వీలు పడకుండా వున్న అమరేంద్ర ఒక్కసారిగా లోపలకు దూకి శ్యామసుందరంను వెనక్కిలాగి గట్టిగా మొహంమీద కొడతాడు. శ్యామసుందరం ఆవేశంతో తిరగబడతాడు. ఆ యిద్దరూ కలియబడి ఒకరి బలాన్ని ఒకరు పరీక్షించుకుంటూండగా అమరేంద్ర రాజితను చూస్తాడు.)

అమ : (ఆశ్చర్యంగా) రాజిత ! (చిన్నగా గొణుకుతాడు. అదే అదనుగాచూసుకొని శ్యామసుందర్ బలంగా అతనిమొహం మీదకొట్టి వెనక్కి తోస్తాడు. అమరేంద్ర క్రిందపడతాడు. శ్యామసుందరం రాజితను పట్టుకోబోతాడు. రాజిత కంగారుగా బయటికి పరుగెత్తుతుంది! శ్యామసుందరం వెంబడించపోతే అమరేంద్ర వెనక్కిలాగి మళ్ళీ కొడతాడు — ఆయిద్దరూ బలాలు పరీక్షించుకుంటున్న సందర్భములో బయటనుంచి ప్రభాకర్ వస్తాడు! మొహం కళావిహీనంగా వుండి, గడ్డం పెరిగి వుంటుంది! తలమీద జుట్టు చిందర వందరగా పడుంటుంది! అమరేంద్ర, శ్యామసుందరంలు ప్రభాకర్‌ని చూడరు! అమరేంద్ర పోకెటులోనుంచి పిస్టలు తీసి శ్యామసుందరంకి గురిపెట్టబోతాడు) యిప్పుడు ఎక్కడికి పోతావో చూస్తాను! (అతని వెనకే నిలబడిన ప్రభాకర్ తనచంకకర్రను పైకెత్తి అమరేంద్రనుండి పిస్టలు దూరం చేస్తాడు. తిరిగి అమరేంద్ర అందుకోబోతే తెలివిగా పిస్టల్‌ని తను చిక్కించుకుంటాడు) ఆఁ!

ప్రభా ! (నవ్వి) అడుగు ముందుకి వేశావా అక్కడే నెత్తురు కక్కి చావవలసివుంటుంది!

శ్యామ: మీరెవరో సమయానికి వచ్చి కాపాడారు! వాణ్ణి విడిచిపెట్టకండి! వాడు దొంగ! గజదొంగ, కన్నాలువేసే దొంగ!

అమ: అబద్ధం!

శ్యామ: నిజమో అబద్ధమో తెలియడానికి యిదే అవకాశం! యిప్పుడే పోలీస్ రిపోర్టు యిస్తాను. (వెళ్లబోతాడు)

ప్రభా: ఎవరూ కదలడానికి వీల్లేదు.

అమ: ఈ పెద్దమనిషి ఎవరో పిల్లని చెరపట్టడానికి ప్రయత్నిస్తుంటే ఆపేను!

ప్రభా: ఎవరా పిల్ల?

శ్యామ: ఏ పిల్ల? అడగడానికి నువ్వెవరు!

ప్రభా: ఎవరైంనీ పోల్చుకోలేకుండా వున్నారా! మీ మొండి పట్టుదలకు తట్టుకోలేక ప్రాణప్రదంగా చూసుకుంటున్న ప్రియురాల్ని దూరం చేసుకొని అవిటివాడుగా రూపొందిన మీ కుమారుణ్ణి! నన్ను ప్రభాకర్ అంటారు!

శ్యామ: ఆఁ! (సంతోషంతో) నువ్వా! (పరీక్షగాచూసి) నా కుమార్డు ప్రభాకర్‌వా!

ప్రభా: గుర్తించలేక పోతున్నారా! కాలగమనంలో నేరస్తుడుగా జైలుకి వెళ్లాను! శిక్ష అనుభవించి తిరిగివచ్చాను.

శ్యామ: నువ్వు అలాంటి అవమానం పడ్డావా?

ప్రభా: ఎప్పుడైతే భగ్నప్రేమికుణ్ణి అయ్యానో అప్పుడే నా జీవితం తలక్రిందయింది! కన్న తండ్రి కాదనగానే నాకోసం

పరితపించే ప్రియురాలి కన్నీరు తుడవడానికి ప్రయత్నించీ ఫలితం పొందలేక పోయాను! రైలు ప్రమాదంలో కుంటి వాణ్ణయ్యాను! పవిత్రురాలికి అన్యాయం చేయడానికి యిష్టం లేక పశ్చాత్తాప హృదయంతో బిస్మిల్లాఖాన్ అనే మహమ్మదీయ డాక్టరుగా ఆ యింట్లో ప్రవేశించి నా స్వహస్తాలమీదనే ఆ ప్రేమమూర్తికి పెళ్ళిచేసి అన్నగా ఆమె మంచిచెడ్డలు చూస్తున్నాను! అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భర్త చేసిన దురాగతానికి ఆ యిల్లాలు అరస్టు కాబోతుంటే నేరం నామీద వేసుకొని శిక్ష అనుభవించాను! తిరిగి ఆమెకోసం వెళ్ళి ఆమెను చూడలేకపోయాను! ఆమె ఆచూకీ తెల్సుకో లేకపోయాను! చేసేదిలేక తిన్నగా యిక్కడికి వచ్చాను! ఆ పవిత్రమూర్తి ...

అమ: (విచారంగా) ఎవరో కాదు! మీ తండ్రిచేతిలో చిక్కి మరో అవమానానికి తలవంచలేక తప్పించుకు పారిపోయిన రాజిత!

ప్రభా: ఆఁ! రాజిత యిక్కడకు వచ్చిందా! రాజిత నాతండ్రి చేత పరాభవించబడిందా? (అమరేంద్రను ఆశ్చర్యంతో యీర్షగా చూస్తూ) ఎవరు నువ్వు? యీ కథకూ నీకూ యేసంబంధం లేకపోతే నా రాజిత పేరు నీ కెలా తెల్సింది? అక్షరంమీరకుండా చెప్తావా లేదా? (పిస్టల్ గురిపెడతాడు)

అమ: (కళ్ళగంతలుతీసి) నేను మీ అందర్నీ మోసంచేసి రాజితకు అన్యాయంచేసిన అమరేంద్రని!

ప్రభా: కాదు! పచ్చిదొంగవి! నరేంద్రవి!

అమ: అవును! పచ్చిదొంగని! పాతకేడీని నరేంద్రని!

ప్రభా : నా రాజితను ఎందుకు మోసంచేశావ్ ?

అమ : చేయాలనే చేశాను ! చదువుకునేరోజుల్లో నా చంప పగల గొట్టి పదిమందిలో పరాభవించింది ! అప్పుడే దాన్ని పరాభవించి తీరాలని ప్రతిజ్ఞచేశాను! తర్వాత కాల గమనంలో దొంగగా మారాను ! నిజాన్ని మరుగున వుంచి హాజం తీయాలని, ప్రతిజ్ఞ నెరవేర్చుకోవాలనీ తెలివిగా నమ్మించి పెళ్లాడాను! తృప్తిగా అనుభవించి కోరిక చెల్లించుకున్నాను ! కానీ (విచారంగా) కథ యింతవరకూ వస్తుందని తల్చలేదు! నాగురించి యింతమంది నలిగి పోతారని అనుకోలేదు ! మీ అందరి కష్టాలకూ కారకుడు అయిన నన్ను క్షమించు ప్రభాకర్ !

ప్రభా : (చొక్కాపట్టుకొని) క్షమించను ! నిన్ను క్షమించడం మహాపాపం ! ఏది నాచెల్లెలు రాజిత ! యేమైంది నా రాజిత చెప్పు ! (బయటనుంచి శివయ్య రాజిత చెయిపట్టుకుని తీసుకొస్తాడు) ముందు చెప్తావా లేదా? రాజిత యేమైంది ? (పెద్దగా అరుస్తాడు)

శివ : ఇదిగో ! ఏట్లో పడబోతుంటే నేను చూసి ప్రాణాలు పోకుండా తీసుకొచ్చాను ! (అమరేంద్ర శ్యామసుందరంలు బాధపడతారు)

అమ : రాజితా !

రాజి : అమరేంద్ర : (యిద్దరూ కౌగలించుకుంటారు ! ప్రభాకర్ కంటతడి తుడుచుకుంటాడు. ప్రభాకర్ చిన్నగా 'చెల్లీ' అంటాడు.)

రాజి : అన్నయ్యా ! (ప్రభాకర్ దగ్గరకు తీసుకుంటాడు)

శ్యామ: ఆ! మా యింటికో ఆడపడుచు వెలసిందా! నీగుణం తెల్సుకోలేక చేసిన తప్పుకి నన్ను క్షమించు తల్లీ! నీవంటి సద్గుణసంపన్నురాలు ...
శివ: నా కంటపడకపోతే దక్కేదే! జగ్గాన్ని జైలుకి పంపించి రాజిత ఆస్తి రాజితకు యివ్వాలని రాజితకోసం వెదుకుతూంటే రాజిత యిక్కడే వుందని మీనాన్నగారు వ్రాసిన ఉత్తరం అందింది! వెంటనే బయల్దేరేను! దారిలో ...
అమ: భక్తవత్సలుడుగా నా భార్యను రక్షించావ్! నీ మేలు మరువను శివయ్యా!
శివ: ఛా! శివయ్యేమిటయ్య నా పేరు శివశంకరం అయితేను!
అమ: అసలు ...
శివ: అసలూ లేదు పెసలూ లేదు! పదండి అంతా పోదాం! శ్యామ సుందరంగారూ! మీరేమీ అనుకోకండి! మా ప్రభాకర్‌ని కూడా మాతోనే పంపేయండి! రండిపోదాం!
అమ: ముందు నామాట విను! ...
శివ: విన్నాను లేవయ్యా అంతాను! రాజిత చెప్పింది కథంతా!
అమ: కానీ నేను పాపఫలితం అనుభవించాలి! పోలీసు వారి కంటపడకుండా తప్పించుకు తిరుగుతున్న నేను పట్టుబడి ఫలితాన్ని అనుభవించాలి! పశ్చాత్తాపపడి తిరిగిరావాలి! అప్పటిదాకా నాకు శాంతిలేదు. రాజితను ...
ప్రభా: నీకాభయం అక్కర్లేదు అమరేంద్రా! రాజిత నా చెల్లెలు!
శివ: (నవ్వి) చూశారా! తేటమనసులు కలవాళ్ళని భగవంతుడు ఎప్పటికైనా కాపాడుతాడు! నిజానికి దాసులవుతారండి! అమరేంద్ర నిజాయితీ బ్రతుకు బాట

నిర్మించుకుంటున్నాడు! ప్రభాకర్ రాజిత సుఖం కోరి ఆమెతో పవిత్రమైన అన్నచెల్లెలుగా ఆత్మీయతను యేర్పరుచుకున్నాడు, శ్యామసుందరంగారు పూర్తిగా మారి పోయి రాజితను పతివ్రతాత్మతో తమ యింటి ఆడపడుచుగా స్వీకరించారు! నీతి నిజాయితీలకు తలవంచి యెన్ని కష్టాల్నయినా భరించి అన్నసమానుడైన డాక్టర్ని, పెళ్లాడిన భర్తనీ చూడగలిగి యేనాడో పోయిన ఆస్తిని పొందగలిగింది రాజిత (నవ్వి) ఇందులో తేటమనసు కాని దెవరిదో చెప్పండి? కానివాళ్లు జైలుకి పోనే పోయారు! అందరికీ అయామ్ సారీ! నా సంగతి చెప్పకోలేసు చేజిక్కిన ఆస్తి తిరిగి రాజితకు వ్రాశాను! ఆమెను రక్షించాను! నాదీ తేటమనసే సుమండీ! (అందరూ నవ్వుటారు) ఏం కాదా?

ప్రభా: అని ఎవరన్నారు? అందరిపీ కూడా "తేటమనసులు"

అమ: అందరికీ సెలవ్! పోలీసువాళ్లకు నాకు నేనే పట్టుబడతానికి వెడుతున్నాను! తిరిగి రాగానే కల్సుకుంటాను!

శ్యామ: ఇంతలో మీరిక్కడవున్నట్లు యే పోలీసువాళ్లకీ తెలియదు! ఎలాగూ వున్నారు కనుక అందరం కలిసి ఆనందంగా విందారగిద్దాం మాయింట్లో! మధ్యాన్నం వెళ్లి పట్టుబడుదురుగాని లెండి!

ప్రభా: అవును బావా!

శివ: చూశారా చూశారా! "తేటమనసులు" కలవాళ్లెప్పుడూ యిలాగే కళకళ్లాడుతూంటారు (అంతానవ్వుతారు)

[ తెర ]

— జనగణ మన —





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA110B153 |
| పుస్తకం పేరు | తేటమనసులు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 105 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | F, , G, H, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Haseema |
| పేజీలు విడదీసినది | Haseema |
| స్కాన్ చేసినది | Heena |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |